# పంచతంత్రసంగ్రహము

(నారాయణకవిప్రణీతము.)






రెండవకూర్పు 1000.

ప్రకాశకుఁడు

దుగ్గిరాలపల్లంరాజు.

పిఠాపురము.

1928

 [వెల 0-10-0 లు.

For copies apply to :—

**The Manager**

V. M. R. Book Depot,

PITHAPURAM.

(East Godavari.)




పి ఠా పు ర ము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల

1928.




# పీఠిక



శ్రీ నారాయణకవి పంచతంత్రమునుండి యుపకథలను తొలఁగించి కేవలము పంచతంత్రములనుగూర్చిన కథాభాగముల నుచితరీతిని సేకరించి పాఠశాలలయందలి బాలురకుఁ బఠనీయగ్రంథముగా నుపయోగపడునట్లు దీనిని బ్రకటించితిమి.

పంచతంత్రము కేవలము విద్యార్థులకొఱకే రచియింపఁబడినది. కాని యందు ప్రస్తావోచితంబులగు వివిధకథలు వ్రాయంబడి యున్నవి. అందువలనఁ బంచతంత్రములును బాలురకు సుబోధకము లగుటలేదు. కావున విద్యార్థులకు సులభముగాఁ బంచతంత్రములును బోధపడఁగలవనునుద్దేశముతో మేమిట్లు దీనిని సంగ్రహించి ముద్రించితిమి.

ఇంకను నిట్టియుపయోగకరము లగు గ్రంథములను బ్రకటింపఁదలఁచితిమి. కాఁబట్టి విద్యాధికారులగువారతనము వారీగ్రంథమును పఠనీయగ్రంథముగా నేర్పఱచి మాయుద్యమమునకుఁ జేయూఁత నొసంగవలయు నని కోరుచున్నాము.

ప్రకాశకుఁడు.



శ్రీరామ.

# పంచతంత్రసంగ్రహము.

## మిత్రభేదము.

సీ. కలదు దక్షిణాపథమునఁ గనకరత్న
రాజితంబయి మహిళాపురం బనంగ
వర్ధమానుం డనఁగ సార్థవాహుఁ డందు
నధికసంపత్సమృద్ధిచే నతిశయిల్లు. 1

వ. ఇట్లున్నసార్థవాహుం డొక్కనాఁడు తనధనంబు వృద్ధినొం
దించుటకుఁ దలంపు పుట్టి, 2

గీ. అరసి లేనిచోట నర్థ మార్జింపంగఁ
దగిన యది సురక్షితంబుగాఁగఁ
జేసి వృద్ధిఁ బొందఁజేయు తెఱంగున
నట్టిధనము సద్వ్యయంబు సేయు. 3

క. నేరవలె నివ్విధంబున
నేరుపులేకున్నవాని నిలయమున ధనం
బేరీతి నిలువదది ని
ష్కారణమయి విరియఁబాఱుఁ గానరు మూఢుల్. 4

సీ. సంరక్షసేయని స్వర్ణ మప్పుడె చెడు సీ
వృద్ధిఁబొందింపనివిత్త మెడయు
ననుభవతకురాని యర్థంబు గల్గియు
లేనిఫలమెగాని లేదు సుఖము
తగ నుపార్జించియు ధనము పాత్రి మెఱింగి
దక్షత నిడిన సంరక్ష యదియ
నిండినచెఱువుకు నెరయ వాటముగాఁగ
నలువులు దీర్చినయట్ల కాన

ధనము లార్జించి సంరక్ష తగ నొనర్చి
వృద్ధిఁ బొందెంచి యనువుగా వెచ్చపఱిచి
నడపనేర్చినవాని జన్మంబు సఫల
మున్న వారలజీవన మెన్న నేల. 5

చ. తమ యుదకంబు వాహినులు
బ్రావనిభంగి ఫలించినట్టి వృ
క్షములు ఫలంబులం దినని
చందమునన్ జలదంబు నీట స
స్యములకుఁ దృప్తిఁజేసి యవి
సమ్మతిఁ గోరక యున్నమాడ్కి ను
త్తములధనంబు సజ్జనుల,
దార్కొనుఁ బ్రత్యుపకారనిస్పృహన్. 6

# మిత్రభేదము

సీ. అని వర్ధమానుండు తనమదిఁ జింతించి
శకటంబునను బెక్కుసరకు లెత్తి
యందు సంజీవకనందకాఖ్యములగు
వృషభయుగ్మముఁ గట్టి విపినభూమి
త్రోవ రాజ్యమునకుఁ బోవఁగాఁ దెరువున
నిమ్నోన్నతంబుల నీల్గి తివియ
జానుభగ్నం బైన సంజీవకుని గనుఁ
గొని వర్ధమానుఁ డాకులత నొంది

పరిజనుల నాతఁ డందున్నసరకు లెల్ల
మోవఁ గట్టడచేసి సంజీవకునకుఁ
గాపు కొందఱఁ బెట్టి యక్కడఁ దొలంగి
చింత నొందుచుఁ బోవ ననంతరంబ. 7

ఉ. కావలియున్న యాభటని
కాయము లుగ్రవనంబులోపలన్
జావఁగ నేల పోదమని
చయ్యన నేఁగి నిజేశ్వరుం గళా
కోవిదుఁ గాంచి యొక్కహరి
కూడఁగ ముట్టిన నేముపాఱ సం
జీవకుఁ బట్టిచంపె నది
చెప్పఁగ సిగ్గగు మాకులంబునన్. 8

క. అని యివ్విధమున వారలు
వినయం బెసఁగంగ వచ్చి వినిపింప నిజం
బని సంజీవకుఁ దలఁచుచు
మనికితపడుచుండె వర్ధమానుఁడు బుద్ధిన్. 9

వ. అట సంజీవకుండు. 10

చ. విఱిగినకాలు వచ్చి యట
వీస్థలి నాయువుకల్మిఁ జేసి యే
త్తెఱఁ జని పూరి మేసి కడు
తియ్యని చల్లనినీరు ద్రాగి మై
యొఱుఁగక సత్వసంపద వ
హించి భయం బొకయింత లేక యు
క్కుఱ నొకనాఁడు దాహ మెసఁ
గ న్నదికిన్ వడి నేఁగునత్తఱిన్. 11

గీ. ఆవనంబునఁ బింగళకాఖ్యుఁ డయిన
సింహ మధికజంతువుల శాసింప నధికుఁ
డగుచు నిజభుజవిక్రమణాఢ్యమహిమ
ననుభవించుడు రాజ్యంబు వినుతి కెక్కె. 12

శా. ఆసింహం బొకనాఁడు దాహమునఁ దో
యం బానఁ గాంక్షించి పే
రాసం దా యమునాతరంగిణిని డా
యం బోవుచో నవ్వనిన్

భూసంత్రాసకరాంత్యకాలజలద
ప్రోద్భూతగర్జోపమ
వ్యాసంగంబుగ ఱంకెవైచె నొకచో
నాఁబోతు కాల్ద్రవ్వుచున్. 13

క. బెడిదంబుగ నవ్విధమున
నడరిన సంజీవకుని మహాధ్వని విని య
ప్పుడ మృగపతి తనయాత్మం
గడుశంకం బొంది యచటఁ గదలకయున్నన్. 14

గీ. ఆతని మంత్రితనయు లైనట్టి కరటక
దమనకాఖ్యు లపుడు తద్విధంబుఁ
దెలిసి దమనకుండు తెఱఁగొప్పఁ గరటకు
తోడఁ బలికె నగవు తోఁప నపుడు. 15

గీ. ఇంతరాజు మాడు వింతశబ్దము విని
నదికి నీరు త్రావఁ గదల వెఱచె
దీని కారణంబుఁ దెలియుదమే యన్నఁ
గరటకుండు వలికెఁ [illegible]డ. 16

[illegible] మనయేలిక భక్షింపఁగా
[illegible] యది భక్షింతము రమ్మనిన
[illegible] గొలిచి తనకడుపుఁ బోషించుకొను
మాత్రంబైనఁ గొలువ నేల వినుమని యిట్లనియె. 17

క. మిత్రుల కుపకారంబును
శత్రుల కపకారమును నిజంబుగఁ జేయన్
క్షత్రియులఁ గొలుచుట; యుదర
మాత్రము కొఱకైన సేవ మహిఁ గొఱయగునే. 18

క. ఒక్కరుని బ్రతుకువలనన్
బెక్కండ్రు మహాసమృద్ధిఁ బెరుఁగక యున్నన్
ముక్కునఁ బొడుచుక తినియెడి
కొక్కెర తనకడుపుఁ బ్రోచుకొనదే తలఁపన్. 19

సీ. స్వల్పవసాస్నాయు సంయుత కఠినాస్థిఁ
గొఱుకు నాఁకలి మానుకొఱకుఁ గుక్క
సింహంబు తనయంకసీమ జంబుకమున్న
దృష్టించి మఱి దాని తెరువు వోక
శుంభదుజ్జృంభితకుంభికుంభంబుల
మెదడు భక్షింపంగ మదిఁ దలంచు
హీనులు నధికులునైన మానవులును
దమతమకొలఁది సత్వములఁ దలఁతు
రఖిలకర్మంబులను గాన నాత్మశక్తి
కనుగుణంబైన ఫలములె యావహిల్లు
నట్లు నీవును జాతి మర్యాదతోడి
తలఁపుఁ దలఁచితి విది దొడ్డతనము గాదు. 20

సీ. వాలంబు నులిచియు నేలఁ గాళ్ళుడఁచియు
ధాత్రిపైఁ బొరలియుఁ దాల్మి విడిచి
వదనంబుఁ దెఱచియు నుదరంబుఁ జూపియుఁ
బెక్కు పాట్లను బడ్డ కుక్క కొక్క
కడియెుఁడన్నమె కాని కడుపార నిడఁబోరు
నాగంబునకుఁ బ్రార్థనంబుతోడఁ
గబళశతంబులు కరమువ కందియ్య
నాఁకలిదీఱంగ నది భుజించు
నెంత కార్పణ్యపడినను హీననరున
కెవ్వరును నీరు కడునల్ప మిచ్చిరేని
ఘనున కూరక యుండంగఁ గాంక్షదీఱ
గురుతార్థంబు లిత్తురు ధరణిపతులు. 21

క. ఘనవిద్యావిక్రమములు
మనుజేంద్రులు చూచి మెచ్చి మఱి బ్రతికినఁగా
కనయంబుఁ బోఁక నులిచిన
శునకమునకుఁ గడెఁడుకూడు చూడక యిడరే. 22

గీ. పౌరుషజ్ఞానకీర్తులఁ బరఁగెనేని
వానిసంపద యొకపూఁటయైనఁ జాలు
నుదరపోషణమాత్రకై యుర్విమీఁదఁ
గాకి చిరకాలమున్న నేకార్య మగును. 23

క. సకలహితాహితగుణముల
వెర వెఱుఁగక చరిఁకిఁ [illegible]
దరభరణకేవలేచ్ఛ
బరఁగెడు నరపశువు పశుప్రతియున వినవే. 24

వ. అనినఁ గరటకుం డిట్లనియెను. 25

క. మనము ప్రధానులమే యే
పనులకుఁ గర్తలము గాము బహునీతులకుం
బనియేమి యనిన నతనికి
వినుమని దమనకుఁడు పల్కె వివరం బేర్పడఁగన్. 26

గీ. భాగ్యవశమున [illegible]
బుద్ధిబలమున [illegible]
నృపులు [illegible]
బూని రాజ్యంబు సమప్రధానుఁ డగును. 27

చ. నడివడి మంచిదైనను జ
నంబులు పెద్దఁగఁ జూతు రాతనిన్
నడవడి చక్కఁగానినరు
నచ్చిన చుట్టములైనఁ జేరనీ
రెడఁగలుగంగఁ ద్రోలుదు ర
హీనతయున్ లఘువృత్తియు న్మహీన్
నడవడిచేత వచ్చు నది
నైజము దీని నెఱుంగ వింతయే. 28

ఉ. కావున నిప్డు డివ్విభునిఁ
గన్గొని చిత్తమువచ్చునట్లుగా
సేవ యొనర్చి మన్ననలఁ
జెందెదనన్న నతండు మున్ను ధా
త్రీవిభులన్ భజింపవు త
దీయచరిత్ర మెఱుంగుదే యనన్
గోవిదవృత్తి భూపతులఁ
గొల్వఁగనేర్తునటంచు నిట్లనున్. 29

గీ. అతిసమర్థుల కిల నసాధ్యంబు లేదు
ప్రోల నుద్యోగికిని దూరభూమి లేదు
విద్యగలవాని కెందును వింత లేదు
వఱలఁ బ్రియవాదికిని శాత్రవంబు లేదు. 30

వ. అనినం గరటకుం డతని కిట్లనియె. మనస్వామిచిత్తవృత్తి యెఱుఁగని నీకుం గదియ నెట్లగు ననిన నతం డిట్లనియె రాజు మన్నించు సేవకుల పొందునం బోయి నన్నెఱింగించుకొని యాసన్నవర్తనుండ నయ్యెద వినుమని యిట్లనియె. 31

ఉ. వీనికి విద్య లేదనరు
వీఁడు కులస్థుఁడుగాఁడు నారు మే
ధానిధి వీఁడుగాఁ డనరు
తమ్ము భజించినఁ జాలు నెప్పుడున్

మానవనాథులుఁ సతులు
మవ్వ మెలర్చిన పువ్వుఁదీగెలుఁ
మానక పార్శ్వసంశ్రితన
మాజముఁ బూని గ్రహించు నిచ్చలున్. 32

గీ. ఎవ్వరెవ్వరి కాత్మల కెద్ది హితము
వారివారికి ననుగుణవర్తనమున
బుద్ధిమంతుఁడు శీఘ్రింబ పొసఁగ మెలఁగి
యతని వశ్యునిగాఁ జేయు నాక్షణంబ. 33

గీ. చటులసింహ శరభ శార్దూల గజముల
వశ్యములుగఁ జేయవచ్చు ననిన
నరయ మిగులఁ దద్జ్ఞు లగువారలకు నల్ల
యవనిపతులు వశ్యు లగుట యెంత. 34

వ. అనినం గరటకుండు దమనకా నీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగు మనిన దమనకుండు పింగళకు సమ్ముఖంబునకుం బోయి మ్రొక్కిన నాసీనుంగా నియమించి కృపాకటాక్షంబు లొలయఁ బింగళకుండు నిన్నుఁ జిరకాలంబునకుఁ బొడగంటిమి భవదాగమనంబునకు నిమిత్తం బేమని యడిగిన దమనకుండు భవత్పాదపద్మంబులకు నావలనం బ్రయోజనంబు గలుగుటంజేసి పనివింటి నమాత్యుం డైనవాఁడు దనయేలికకు నవసరంబు గలయప్పుడు కార్యాకార్యంబు లెఱింగింపఁ బిలువకున్నను గదియవలయు నేనకా దెట్టి

మానవుం డైనను బార్థివేంద్రునకు నొక్కొక్కవేళం బ్ర
యోజనపడు నని యిట్లనియె. 35

గీ. కర్ణములతీఁట దంతనిర్ఘర్షణంబు
వేఱు తృణకాష్ఠములఁ గాని తీఱ దనిన
నంగవాక్పాణిపదముల నమరునట్టి
నరుఁడు గొఱగాక యుండుట ధరణి గలదె? 36

క. అనిపలికి దమనకుం డి
ట్లను నన్ను సృగాలమాత్రు మని నీచిత్తం
బునఁ దలఁపక నావిన్నప
మనఘాత్మ వినంగఁదగుఁ బ్రయత్నముతోడన్. 37

సీ. సూకరరూపంబు భీకరంబుగఁ దాల్చి
పుండరీకాక్షుండు పొగడువడఁడె
మృగరూపమునఁ బుట్టి జగతిఁ బ్రసిద్ధుఁడై
ముని సురేంద్రునిచేత మ్రొక్కుఁగొనఁడె
ఛాగస్వరూపంబు షణ్ముఖుండు ధరించి
సురసమూహమునఁ బ్రస్తుతి గనండె
యింద్రాగ్ను లిరువురు నెసఁగంగఁ బక్షులై
పృథులసత్కీర్తులఁ బెంపుగనరె
యల్పజంతువు లని వారి నాదరింప
కుండెనే తొల్లి సురమునిమండలంబు

గాన నీవును నను జుల్కఁగాఁ దలఁపక
చిత్తమునఁ జేర్చి నామాట చిత్తగింపు 38

క. అసమర్థుఁడైన హితుఁడును
నసమానసమర్థుఁడైన యహితుండును న
వ్వసుధాధిపునకుఁ గొఱగా
రెనఁగఁగ నాశక్తిభక్తు లెఱుఁగఁగవలయున్. 39

గీ. అనుచు నిట్లు దమనకాఖ్యుండు పలికిన
నర్థిఁ బింగళుండు నతని కనియె
బాసఁగ మాకు మంత్రిపుత్త్రుండ వగుటను
జెప్పఁదగినబుద్ధి చెప్పఁదగదె. 40

క. అన నతఁడు విన్నవించెద
ననఘా యుదకార్థి వగుచు యమునానదికిం
జనుచుండి వెఱఁగుపడి ని
ల్చిన కారణ మేర్పడంగఁ జెప్పుము నాకున్. 41

వ. అనిన నాతం డిట్లనియె. 42

సీ. ఈయున్న వనమెల్ల నాయధీనం బిది
సర్వసత్వాశ్రితసంకులంబు
కడిమి నిన్నాళ్లును గదలకుండితిమి యీ
విపినంబు నేఁడింక వెడలవలసె
నెట్లన్న నొకశబ్ద మేమని చెప్పుదు
నశనినిర్ఘోషంబు ననుకరించి

సాకర్ణములు సోఁకినను భయంబొందవిన
విన్నచోటనె నిల్చి యున్నవాఁడ
శబ్ద మూహింప నుత్కృష్ట జంతువునకుఁ
గాని యల్పజంతువునకుఁ గలదె యిట్టి
దేమిసేయుదు ననిన మృగేంద్రునకును
దమనకాఖ్యుండు వల్కె నందంత మొక్కి. 43

వ. దేవా శబ్దమాత్రంబునకు శంకింపం బనిలేదు. 44

గీ. బహుజలంబుల సేతువు పగిలిపోవు
విను మరక్షితమంత్రంబు విడిసిపోవుఁ
గొండియంబున సఖ్యంబు గ్రుంగిపోవుఁ
గఠినభాషలఁ బడిపోవుఁ గాతరుండు. 45

క. అని కీర్తించుచుఁ దమనకుఁ
డనఘా నీవపుడు వినఁగ నార్భటమటుఁ జే
సిన యాతఁడు సంజీవకుఁ
డనఁ జను వృషరాజు సౌమ్యుఁ డనఘుఁడు బుద్ధిన్. 46

తరల. అతఁడు నీకును మంత్రి గాఁదగు
వాయనం గొనివత్తు నే
నతులవిక్రమ పోయివచ్చెద
నన్న నాతఁడు పొమ్మనన్
ఖితతవాక్యవివేకసంపద
వింతభావము మాన్చి తాఁ

జతురతన్ వృషభేంద్రు సింహము
సమ్ముఖంబునఁ బెట్టినన్. 47

క. అదిమొదలుగ సంజీవకు
వదలక మృగనాథుఁ డధికవాత్సల్యం బిం
పొదవఁగఁ దనయొద్ద సచివ
పదవికిఁ దగువిభవ మిచ్చి పనిగొను నంతన్. 48

మాలిని. కరటదమనకాఖ్యుల్
గాఢచింతాంతరంగ
స్ఫురితబహువిధోక్తుల్
శోకమూలంబుగాఁగన్
బరఁగఁగఁ దమలోనన్
బల్కుచున్నట్టివేళం
గరటకుఁ డనె వానిం
గణ్ణశూలంబు గాఁగన్. 49

గీ. సరవి నిన్నాళ్లు సింహేశ్వరుఁడు మనలఁ
బరిజల నొక్కరు లేకుండ భక్తిఁ బ్రోచె
వెనుక సంజీవకుండు వచ్చినది మొదలు
విడిచె నిది భవత్కృతదోషవిధిన కాదె. 50

వ. అనిన వానికి దమనకుం డిట్లనియె. 51

గీ. దృష్టముగఁ గార్యమంతయుఁ దెలియుకొఱకు
నెసఁగు లోకపరివర్తనం బెఱుఁగు ఁఱకుఁ

దుది ననర్థకార్యంబులఁ ద్రోచుకొనకుఁ
దగిన దెయ్యది యదియ మంత్రింబునుమ్మ. 52

ఉ. కావున మంత్రిభిన్నమయి
కార్యము దప్పకయుండ నిష్టు సం
జీవక పింగళాఖ్యులకుఁ
జేరక భేదము పుట్టునట్లుగా
నే వెరవైనఁ జేయక స
హించిన నవ్విభుఁ జేరవచ్చునే
సేవకకోటికిన్ మనకు
సీమఁ దొలంగుట గాక యుత్తటిన్. 53

వ. ఎంతటి బలవంతు నైనను బుద్ధిబలంబునం జేసి బుద్ధిమంతుండు గెలుచు నని కరటకుం డట్లుకాక నీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగు మనిన దమనకుండు పింగళకు సమ్ముఖంబునకుం బోయి నమస్కరించి యిట్లనియె. దేవరకు నేనత్యంతాపరాధంబు చేసితి సంజీవకునిఁ గొలువం బెట్టి తగనిపనిఁ జేసితిఁ గావున నీయపరాధంబు సహింపవలయునని యిట్లనియె. 54

క. పదవిం బొందిన సచివుఁడు
పదపడి నృపునెదుట నెట్లుపలికిన నమరున్
బదహీనుఁడు తగుపలుకులు
పదివే లాడినను భూమిపతి కింపగునే. 55

క. ఈసంజీవకుఁ డెప్పుడు
నాసన్నిధిఁ దప్పనాడి నగుచుండు నినున్
దా సరకుసేయఁ డేమిట
నీసున నిమ్ముఁ గొలువఁ జేరనీఁ డెవ్వానిన్. 56

చ. అదియునుగా కతండు భవ
దాజ్ఞఁ జరింపక నీప్రభుత్వ సం
పదయును మంత్రిశక్తియును
బ్రాభవశౌర్యమహోద్యమంబులున్
మదమునఁ దప్పనాడును గ్రి
మంబున నీమహిఁ దాన గైకొనన్
మదిఁ దలపోయు నేఁ దెలిసి
మానుగ నీ కెఱిఁగింప వచ్చితిన్. 57

గీ. అనిన భయవిస్మయమ్ములు మనముఁ గలఁప
నేమియును బల్కకున్న మృగేంద్రుతోడ
నధిప నీమంత్రి నీకంటె నధికుఁ డైన
కతన నభివృద్ధి నీకెట్లు గలుగు వినుము. 58

గీ. మహిమ నత్యుచ్ఛ్రియుం డగు మంత్రిమీఁదఁ
బార్థివునిమీఁద నొక్కొక్కపదము నిలిపి
నిల్పి శ్రీస్వభావంబున నిల్వలేక
యుదధికన్యక వారిలో నొకని విడుచు. 59

ఉ. పెంచి యనేకసంపదలఁ
బ్రీతి వహింపఁగఁ జేసి తన్ను మ
న్నించిన రాజుమీఁదఁ దుది
నేరమువెట్టి పరావనీశదే
శాంచితభూరిసంపదల
కాశపడున్ వడి హానిఁ బొందునే
మంచితనంబు దుష్టులగు
మంత్రులకుం గలదే తలంపఁగన్. 60

క. సేవకులు లోకమందును
శ్రీవిశ్రుతులైన నేల సేవింతురు ధా
త్రీవిభులఁ దమకు జరగమి
కై వలసిన పంపుసేయనగుఁగాక మహిన్. 61

వ. అనినం బింగళకుండు సంజీవకుండు నాకత్యంతస్నేహితుం
డెట్లు విడువనేర్తు నని యిట్లనియె. 62

గీ. సకలదుష్టదోషసహితదేహం బిది
నాకు నేటి కనినవాఁడు గలఁడె
అట్లు నిజహితుండు నప్రియం బొకచోటఁ
గడఁగి చేసెనేని విడువరాదు. 63

ఉ. నమ్మికయిచ్చి చేకొని ఘ
నమ్ముగఁ బూజ్యునిఁ జేసి మాటమా

త్రిమ్మన వీఁడు గాఁడని వృ
థా బహుదోషము లెన్ని భృత్యు రా
రమ్మని యాజ్ఞసేయ నగ
రా నను లోకము వారు వాని నే
రమ్మన వాఁడె పోవుఁ దెగ
రాదు కలంపకు నాదుచిత్తమున్. 64

వ. అనిన విని దమనకుం డిట్లనియె. 65

ఉ. ఎంతయు గారవించి తను
నింతయమాత్యునిఁ జేసి రాజ్య మి
ట్లింతయుఁ జేతి కిచ్చి యన
యమ్మను దేవర నమ్మియున్నచోఁ
గొంతయునం దలంపక ని
గూఢముగా మహియెల్లఁ గైకొనన్
జింత యొనర్చు చే నెఱిఁగి
శీఘ్రమ నీ కెఱిఁగింప వచ్చితిన్. 66

గీ. అన్నదమ్ముఁ డైన నాత్మజుం డైనను
సచివపదవిఁ బనులు జరపుచోట
వానిమీఁదిదృష్టి వదలినయప్పుడా
రాజుఁ బాయు నిందిరావధూటి. 67

ఉ. అప్పటి కప్రియంబయి ని
జాత్మకు మీఁదటికిన్ బ్రియంబుగాఁ

జెప్పెడు వాక్యముల్ విను సు
చిత్తుఁడు నిచ్చక ముజ్జగించి మేల్
తప్పక చెప్పు నుత్తముఁడు
ధారుణిఁ బుట్టరు పుట్టిరేని య
య్యొప్పెడివారల న్విడువ
కుండు రమాసతి యెల్లకాలముల్. 68

కం. పాఁతయగుమంత్రి తనకుం
జేఁతటికముఁ జేసె ననుచు శిక్షించి యొరుల్
లాఁతిం బెట్టిన నీఁతలు
మోఁతలునై రాజు విడుచుఁ బొందక యూకల్. 69

సీ. పాటించి తన పాఁతపరివారమును బోఁచి
హత్తిన నృపునకు హాని గలదె
మొన పేర్చి వైరులు మోహరించిన వేళఁ
గెడింప కప్పుడె దెలుచు టొండె
మొనసి దైవాధీనమున నపజయ మైన
భూపాలుఁ గప్పి గొంపోవు టొండె
నర్థంబు దఱిఁగిన నధిపతి ధనమిచ్చి
నడపలేకుండిన నవయు టొండె
నెవ్విధంబున నైన మహీశువలని
మన్ననకుఁ బోల నిలుతురు మఱవ కెపుడు

పిశునకుండును రెటువంటి వేళలందుఁ
బూర్వపరివారమును బోల్పఁ బురుషుగలదె. 70

గీ. ఎంతసఖ్యంబుఁ జేసిన నెంతప్రియము
చేసి తిరిగిన దుర్జనుచిత్త మేల
చక్కటికివచ్చు శునకపుచ్ఛంబు కడఁగి
వంక యొత్తినఁ జాయకువచ్చు నెట్లు. 72

సీ. వ్యసనదూరుం డైనవాఁడె పో సిద్ధుండు
కీర్తితం బగునదె వర్తనంబు
పురుషానుకూలతఁ బొగడొందునదె భార్య
బుధవర్ణనీయుండె బుద్ధియుతుఁడు
మదముఁ జేయకయుండునదె మంచిసంపద
యాశావిహీనుండె యధికసుఖుఁడు
కపటస్వభావనిర్గతుఁడె సన్మిత్రుండు
విజితేంద్రియుండె వివేకఘనుఁడు
కారణము లేకయును బరకార్యములకు
నోపి తీర్చినయాతండె యుత్తముండు
సమరరంగంబునం దధీశ్వరునిపనికి
వెనుకతియ్యనియాతండె వీరభటుఁడు. 71

వ. అని యిట్లు దమనకుండు చెప్పిన విని పింగళకుండు నాపరా
క్రమం బెఱింగియు సంజీవకుఁ డెట్టిసాధనంబుల నన్ను
సాధించువాఁ డనుటయు నతం డిట్లనియె. 73

ఉ. కొమ్ముల గ్రుచ్చి యెత్తియును
ఘోరఖురాగ్రనిపాతనంబులన్
జిమ్మియు దంతఘాతములఁ
జించియు వాలవిశాలచాలనో
గ్రమ్ముల నెమ్ములెల్లఁ గడి
ఖండలుగాఁ జదియంగ మోఁదియున్
సమ్మదమార్పఁ జించు మృగ
సత్తమ యేమఱియుండితేనియున్. 74

వ. అనిన విని పింగళకుం డొక్కింత చిత్తక్షోభంబుగా దమన
కుం జూచి నీవింతట నెరిగి యావృషభనాయకుని యభి
ప్రాయం బెఱింగి శీఘ్రంబ రమ్మన వాఁడును నంతంత
నాదుఁగుచుఁ జకితుండునుంబోలె సంజీవకుం జేరంబోయిన
నతం డిదియేమి భయకంపితుండ వగుచుఁ జనుదెంచితివి.
కుశలంబ కదా యనిన సేవకధర్మంబునం దిరుగువానికి సం
సారసుఖంబు గలదే వినుమని యిట్లనియె. 75

ఉ. ఇంతటివానిఁ జేసె నృపుఁ
డింతధనం బొడఁగూడెఁ బక్ష మ
త్యంతము నాపయింగల ద
యత్నసుఖానుభవంబు దీర్ఘకా
లాంతరసంచితం బని ని
జాత్మఁ దలంచును బాలిశుండు ప్రా

శాంతముగాఁ దలంచి చలి
తాత్మతనుండు వివేకి యిమ్మహిన్. 76

సీ. ధనవంతు గర్వంబు దాల్పకున్న కేలుండు
వ్యసని కాపద యేల పొసఁగకుండు
సతులఁ జూచిన మతి చలియింప కేలుండు
నృపులమన్నన లేల నిజములగును
గాలంబుచే రూపు కడచన కేలుండు
గౌరవ మర్థి కేకరణిఁ గలుగు
దుర్జనవాగురఁ దొడర కెవ్వఁడు నిల్చుఁ
జిరకాలసుఖము నేనరుఁడు పొందుఁ
గానిగుణములు విడిచి పుణ్యానుకూల
వర్తనంబుల నిహపరనైభవములఁ
బొందువాఁ డొక్కఁడొక్కఁడు పుణ్యపురుషుఁ
డతఁడు దేవాంశజనితమహాత్ముఁ డండ్రు. 77

క. ఏకాలంబున రాజులఁ
జేకొని సేవకులు నమ్మి చెడు టది సిద్ధం
బీకాలఁది నే నెఱింగితి
నీకుం జెప్పంగఁ దగు ననింద్యచరిత్రా. 78

ఉ. ఎప్పుడు మోసపోవక మృ
గేంద్రునిపైఁ దగువేగువెట్టి తెం

పొప్పఁగ నాయితంబయిన
నోపికమ్మట్టిన కార్యమైనచోఁ
దప్పక నిర్వహించుకొని
ధాత్రికి నీవ యధీశ్వరుండవై
చొప్పడకున్న మాబ్రతుకు
సూవె వృథా వృషభాధిపోత్తమా. 79

క. విపరీతచిత్తవృత్తునిఁ
గపటి దయారహితుఁ జపలు గాంభీర్యగుణ
వ్యపగతు రాజని కొల్చిన
నపరాధము లేకయైన నాపద వచ్చున్. 80

చ. కొలువున కీవు రాఁ దడవ
ఘోరకరాగ్రవిశాలదంష్ట్రిలన్
మెలఁగఁగ నిన్నుఁ బట్టి బలి
మిన్ గళరక్తము మున్నగ్రోలి క
ట్టలుక నిజాశ్రితప్రితతి
కంతటికిన్ భవదీయమాంస మ
గ్గలముగఁ బంచిపెట్టుటకుఁ
గా నియమించె మృగేంద్రుఁ డుగ్రతన్. 81

వ. ఇత్తెఱంగు నేఁడకాదు. పెద్దకాలంబునుండియుఁ బింగళ
కుండు నీనామంబు ప్రసంగవశంబునం గొలువులోపల

వినంబడినయప్పు డసహ్యాతయుఁ బ్రజమెచ్చు నీపారవశ్యం
బును మెచ్చుమియును నీవారలై నవారలయెడ నాగ్రహం
బును నీవు వెలిగానిసంపద కసూయయు నీయొప్పమికిఁ బ్రి
యంబందుఁచిత్తంబును నై యున్నవాఁడు. మున్ను నీకు శప
థం బిచ్చి కొలిపించుటం జేసి యివ్విధంబునం దెలుపం జను
దెంచితి నీకుఁ బొందైన తెఱంగు చూచుకొమ్మనిన సంజీవ
కుం డత్యంతదుఃఖాకులుం డగుచు నిశ్చేష్టితుండై యూర
కుండి కొండొకసేపునకు దమనకుం జూచి యిట్లనియె. 82

ఉ. పూని దురాత్మగమ్య యగు
పొల్తుకచక్కఁదనంబుఁ బాత్రిస
న్మానన మెఱుంగలేని నర
నాథువివేకముఁ గష్టవృత్తినై
నాసినలోభిసంపద మ
హాంబుధిలోపలఁ బర్వతంబులం
దూనినవర్షధారలును
యోగ్యముగావు నిరర్థకంబులౌ. 83

క. నేరమున కలుగు భూపతి
చేరువనె ప్రసాద మొందు సేవకులపయిన్
నేరము లేకయె యలిగెడు
భూరమణుని మనసు ప్రీతిఁబొందునె యెపుడున్. 84

గీ. వైద్యవిద్వజ్జనామాత్యవర్యు లేధ
రాధిపున కిచ్చు లాభము రావిభుంహు
సంతతారోగ్యధర్మతోషముల వృద్ధిఁ
బొందనేరక శీఘ్రంబ పొలిసిపోవు. 85

కం. గుణులం జేరిన పురుషుఁడు
గుణియగు నవగుణులఁ గూడి గుణహీనుఁ డగున్
బ్రణుతికి నెక్కిన నదులు ల
వణజలధిం గూడి చెడినవసువున నెందుఁ.

సీ. దారుణాటవి రుదితంబుఁ జేసినయట్లు
చేరి శవంబుఁ గై చేసినట్లు
నిర్జలం బైనచో నీరజం బిడినట్లు
వట్టిచోటను విత్తు వెట్టినట్లు
సారమేయముతోఁకఁ జక్కఁగట్టినయట్లు
చెవిటి కేకాంతంబు చెప్పినట్లు
తనరఁ జీకునకు నద్దంబుఁ జూపినయట్లు
వెలిమిడిలో నెయ్యి వేల్చినట్లు
చాలనవివేకియైనట్టి జనవరేణ్యుఁ
దగిలి కొలుచుట నిష్ఫలత్వంబు సేయు
సేవకుల కెల్లభంగి విశేషబుద్ధి
నిల వివేకంబుగలరాజుఁ గొలువవలయు. 87

చ. శరనిధి దాఁట నావయును
సంతమసం బడఁగింప దీపమున్
వరకరిశిక్ష కంకుశము
వాయువుఁ గూర్పఁగఁ దాళవృంతముల్
వెరవునఁ జేసె బ్రహ్మ యది
వేలవిధంబుల మూర్ఖచిత్తవి
స్ఫురణ మడంపలేక తల
పోయుచు నిప్పుడు నున్నవాఁ డొగిన్. 88

వ. అనిపలికిన సంజీవకుం డిట్లనియెఁ దృణాహారవ్యవహారంబు
నఁ బతిహితకార్యంబు చేయు నాకుఁ గాలముఖప్రవేశంబు
కర్తవ్యం బయ్యె నింక నెక్కడిబ్రతుకు క్రొత్తగాఁ గొలి
చిన సేవకుం డెంతబలవంతుం డయ్యును రాజునకును బరి
వారంబునకును హత్త నేరఁడు. 89

క. సన్నపువారల నధిపతి
మన్నించినఁ బ్రొద్దుఁ జైనమంత్రికి బ్రతుకే
మున్నది మునుము న్నతఁడును
సన్నకసన్న నటుఁ బాసి చనకున్నఁ జెఱుపున్. 90

గీ. వజ్రమును రాజతేజంబు వసుధమీఁద
నతిభయంకరమగు నందు నశనిపాత
మొక్కనినకాని నొప్పింప దుర్విరిపుల
రాజతేజంబు చేయును సర్వాప్తముగను. 91

క. ఉడుగక కార్యాకార్యము
లెడఁదం బరికింప నెఱుఁగ కేపను లైనన్
జెడఁజేసెనేని వానిం
దడయక గురునైన విడువఁదగు నేభంగిన్. 92

వ. కావున నాకిప్పుడు యుద్ధంబ కార్యంబు నానిశ్చయంబు వినుము. 93

గీ. పన్ని రణమున నిలువక పాఱిపోయి
ప్రాణములు దాఁప నెప్పుడుఁ బడకపోదు
ప్రాణసంశయ మైనచోఁ బ్రాజ్ఞుఁ డెదిరి
గెలుచు నొండైన మృతినొందుఁ దొలఁగి పోఁడు. 94

వ. అనిన విని దమనకుం డిట్లను రణమరణంబు మంచిదని యసాధ్యశత్రుమధ్యంబునం దఱియ నుఱుకంజనునే శత్రు పరాక్రమం బెఱుంగక వైరపడు నెవ్వఁడు వాఁడు పరాభవంబు నొందు నని చెప్పి దమనకుండు కరటకుం డున్నయెడకుఁ జని మన ముద్యోగించిన కార్యంబు సఫలం బయ్యె నన్యోన్యభేదంబులు పుట్టె నని చెప్పి. 95

గీ. నయవిశారదు లైన మానవులచేతఁ
దెమల భేదింపరానికార్యములు గలవె
గాన నేనును నానేర్పు కరము నెఱపి
కార్య మీడేర్చుకొంటిని గడిఁది ననుచు. 96

వ. పింగళకుని సమ్ముఖంబునకుం బోయి పగతుండు వీఁడె యు
ద్ధసన్నద్ధుండై చనుదెంచుచున్నవాఁడు నీవిప్పుడు సయిమ
ఱచియుండందగునె యనిన నతండును దమనకుండు చెప్పిన
తెఱంగునఁ గట్టాయితంబై యెదురుచూచుచుండె నంతట
సంజీవకుండును జనుదెంచి మున్ను దన విన్నచందంబున
నున్న పింగళకు వికృతాకారంబు చూచి వెఱవ కతనిం
దాఁకిన బింగళకునిమీఁదికి లంఘించె నయ్యిరువురకు నన్యో
న్యబద్ధామర్షయుద్ధం బుద్ధురగతిం జెల్లుచున్నసమయంబు
నం గరటకుండు దమనున కిట్లనియె భవద్దుర్మంత్రవిలసితం
బిట్లుండునే పురుషుల కహితం బాచరించుతలంపునఁ బ్రవ
ర్తిల్లు నీవు బుద్ధిహీనుండవు. 94

సీ. కడఁగి మనోవాక్ప్రకారంబు లేకంబు
గాక మిత్రునిఁ గూడి కడఁగునతఁడు
బ్రతిదినసప్రఖ్యాతపాపవర్తనమునఁ
దగిలి ధర్మముచేయఁ దలఁచునతఁడు
నేపార నెపుడుఁ బరాపకార మొనర్చి
పృథుసంపదలఁ గూడఁబెట్టునతఁడు
సమధికం బగుదేహసౌఖ్య మపేక్షించి
చెలఁగి విద్యల నభ్యసించునతఁడు
బరుసఁదనమున నేప్రొద్దుఁ బద్మముఖులఁ
బొసఁగ వలపింతు నని తలపోయునతఁడు

తెలుకచాలనివా రని యిద్ధరిత్రి
నెఱయ నూహింతు రనిశంబు నీతివిదులు. 98

సీ. సముద్రుని వాహినీసంపూర్ణ జలములు
వడి లవణాబ్ధిలో నడఁగుదాఁక
పరికటితస్నేహసంబంధబంధుత్వంబు
లంగనానిర్భేద మయినదాఁక
నత్యంతకాంతరహస్యవాక్యంబుల
వివరించి కొండీఁడు విన్నదాఁక
కలితపారంపర్యకులసమృద్ధి దలంప
నిలఁ గుపుత్త్రుం డుదయించుదాఁక
నిలుచుటలు గాని యటుమీఁద నిలువ వసకి
దప్పదండ్రు నయశాస్త్రధర్మవిదులు
నీవు కులహాని యగునట్టి నీచగతికిఁ
దగిననడవడి గన భయం బగుచునుండె. 99

గీ. ఎఱుకగలవానిపొందైన నొందు నమరు
నతఁడు కపటాత్ముఁ డయ్యెనే వదియుఁ గాదు
మూర్ఖుతోఁ గూడి మెలఁగెడు మూర్ఖశఠుని
సఖ్య మొందుట కొఱగాదు సజ్జనులకు. 100

వ. అని యిట్లు కరటకుండు పలుక దమనకుం డిట్లనియె. మహ
ప్రాజ్ఞ నాయీపనినిం జంపి చెప్పుము గెలుంగవలముఁ బొద

మని యయ్యిరువురుఁ గదియం జనునప్పుడు పింగళకుం డటమున్న సంజీవకుం దెగటార్చి పశ్చాత్తాపంబునం బొరలుచుండె నప్పుడు దమనకుంజూచి చూచితే యని పలికి యిట్లనియె. 101

శా. పాలింపందగువానిఁగాఁ దలఁచి తాఁ
బాలించి రాజార్హను
శీలం బొప్పదిగఁ జేసి పెంచుటయ ధా
త్రీపాలధర్మంబుగా
కేలా యిట్లు విచారదూరమతినై
యేఁ ద్రుంచితిన్ వాని దు
శ్శీలుండై విషవృక్షమైన నిడి తా
ఛేదించునే యెవ్వఁడున్ ? 102

చ. అవగుణి యైనఁగాక సుగు
ణాత్మకుఁ డైన భటోత్తము న్మహీ
ధవుఁడు పరిత్యజింప మఱి
తక్కిన వారు తొలంగిపోదు ర
య్యవినయవృత్తి భూపతికి
హానియు ధాత్రికి నాకులంబునై
భువి నపకీర్తి పుట్టుఁ దల
పోసి తెలఁ గెద నేమిసేయుదున్. 103

వ. అనిన విని దమనకుండు దేవా వైరిసంహారణానంతరంబున నిట్లు సంతాపింపం బనిలేదు వినుమని యిట్లనియె. 104

ఉ. సమ్మదమొప్ప వైరిజన
సంహరణం బొనరించెనేని శో
కమ్మును బొందనేల ఘన
గర్వమునన్ బ్రతికూలవృత్తిగాఁ
దమ్ములు భృత్యులున్ హితవి
తానముఁ బుత్రులుఁ గూడకుండినన్
గ్రమ్మఱ నాజ్ఞసేయఁ దగుఁ
గాదె నృపాలుర కివ్వసుంధరన్. 105

సీ. సార్వకాలికకృపాసంపూర్ణమతియైన
మానవేశ్వరునకుఁ గానిగుణము
కుటిలవిచారసంఘటితమిత్రుండైన
వాని భావించినఁ గానిగుణము
సమధికప్రియమున సర్వభక్షకుఁడైన
భూనిలింపున కది కానిగుణము
ప్రాణేశ సంతతప్రతికూల యగునేని
మానినీమణి కది కానిగుణము
తివిరి సచివుండు రాజ్యంబుఁ దీర్చునపుడు
కడుఁ బ్రమత్తతఁ బొందుట కానిగుణము

చెనసి భృత్యుండు నృపుపంపు సేయకుండు
క్రమముఁగలిగిన నదియును గానిగుణము. 106

సీ. సత్యంబు దప్పక జరపు నొక్కొకచోట
నన్ృతంబు లొకచోట నడరఁజేయు
సరసంపుఁ బ్రియములు సలుపు నొక్కొకచోటఁ
బరుషంబు లొకచోటఁ బల్కఁజేయుఁ
బరమకారుణ్యస్వభావయౌ నొకచోట
నొకచోట హింసకు మత్సహించు
నర్థార్జనాతిసమర్థయౌ నొకచోట
నొడఁగూర్చు బహుధన మొక్కచోట
నమర నృపనీతి పెక్కురూపములు గలిగి
చతురవారాంగనయుఁ బోలె జగతి మెఱయు
నిట్టి నయమార్గములు నీవు నెఱిఁగినపుడు
ఘనతరైశ్వర్యసంసిద్ధి గలుగు నీకు. 107

వ. అని యిట్లు దమనకుండు పలికినఁ గలంకఁదేఱిన చిత్తంబు
నం బ్రియం బంది నిజభృత్యామాత్యవర్గంబులం గూడు
కొని పూర్వప్రకారంబునం సామ్రాజ్యంబు సేయుచుండె.



# పంచతంత్రసంగ్రహము.



## సుహృల్లాభము



సీ. మహికి నలంకారమండనం బై యొప్పు
మహిళాపురప్రాంతగహనభూమిఁ
బాలుపొందు శాల్మలీభూజంబుపై లఘు
పతనుఁడన్ వాయసపతి వసించు
నమ్మహీజముక్రింది కంతట లుబ్ధకుఁ
డరుగుదెంచినఁ గాక మాత్మఁ దలఁచి
దండధరప్రతిముండు వీఁ డిచటికి
నేమికారణమున నేగుదెంచె

నుండఁ గొఱగాదు దుర్జనుఁ డున్నచోట
నెల్లగాకయు నా కింటి కరుగవలయు
నిచటఁ బొద్దయ్యె నిలువంగ నేల యనుచుఁ
జూచుచుండంగ నా చెట్టుచుట్టుఁ దిరుగ.

క. వల వైచి క్రింద ధాన్యం
బలికి నిగూఢంబుగాఁగ నవ్వలిపొదలోఁ

దల మాత్రిచి దృఢదృష్టిం
దొలఁగక కనుఁగొనుచు నుండ దూరమునందున్. 2

క. కనుఁగొని చిత్రగ్రీవుం
డనఁబరఁగు కపోతభర్త యాధాన్యములం
దిన మనసుపుట్టి తనబల
మును దానును వ్రాలి జాలమునఁ దగులుటయున్. 3

వ. ఇట్లు కాలపాశబద్ధుండునుంబోలెఁ జిత్రగ్రీవుండు సపరివారంబుగా నవ్వలం దగులువడినం జూచి పరిహాసోత్కారంబునం బొదలి లుబ్ధకుండు కదియం జనునంతకమున్న చిత్రగ్రీవుం డనుచరవర్గంబున కిట్లనియె. 4

సీ. ఉదరాగ్నిబాధల నొడలెఱుంగమిఁ జేసి
తడఁబడఁ బడితి మిందఱము వలను
మనకు నాపద దీర్ప మఱి యెవ్వరున్నారు
వెలయ నేఁ జెప్పెద వెరవు వినుఁడు
పురుడించి మన మొక్కపూఁపున వల యెత్తి
గగనభాగమునకు నెగసి చనిన
నిప్పుడీయొప్పమిఁ దప్ప నవ్వలఁ బోవ
వల పాయుటకు నొండువలను గలుగు
ననిన నట్లకాక యనుచుఁ గపోతంబు
[illegible]ంబుగాఁగ నాకసమున

కడరి వలనుగొనుచు నరిగెఁ గ్రివ్యాధుండు
దుఃఖితుండు విస్మితుండు నగుచు. 5

చ. వలఁ బడి చిక్కుకొండె వల
వ్రిచ్చుకపోత్రులు యొండెఁ గాక ప
క్షులు వల గొంచు భారమున
కుం దలఁకొందక యంబరంబునన్
గలఁగక పాఱు టిట్లు వెను
కం గనుఁగొన్నది లేదు చిత్రి మీ
పులుఁగులు నేల వ్రాలఁ గని
పోయి హరించెద నంచుఁ జూడఁగన్. 6

వ. ఆసమయంబున శాల్మలీవృక్షగతం బగు వాయసం బధిక క్షుత్పిపాసాపరవశం బై యుండియు నత్యాశ్చర్యంబుచూచు వేడుక నాకపోతంబుల వెనుకం బఱచుచుండ లుబ్ధకుండును గపోతంబులచేత భూతలగతుం డై యతిత్వరిత గమనంబునం బఱచి యవియు దృష్టిగోచరంబులు గాక దూరం బరిగిన నిట్టూర్పునిగిడించుచు నిజనివాసంబునకుం జనియె నట చని చని చిత్రగ్రీవుం డనుచరవర్గంబున కిట్లనియె. 7

క. నా చెలికాఁడు హిరణ్యకుఁ
డీచేరువ నుండు నెపుడు నిటఁ దా మనపైఁ

దోఁచిన దుర్దశ మాన్పక
జూచు నతఁడు నన్నుఁ దెలియఁ జూచినమాత్రన్. 8

వ. అనఁ గపోతంబు లట్లకాక యని హిరణ్యకుం డనుమూషకంబుబిలంబు గదియ డగ్గినఁ జిత్రగ్రీవుండు తనవదనంబు బిలద్వారంబునం జొనిపి హిరణ్యకా నీసఖుండఁ జిత్రగ్రీవుండ న న్నెఱుంగవలయు ననినఁ దద్వచనంబు లాకర్ణించి సంభ్రమంబున బిలంబు వెడలి పరిగతుం డగు చెలికాని నత్యాదరంబునఁ గౌఁగిలించుకొని దుఃఖితుండై యిట్లనియె.

క. మిగుల వివేకివి నీకుం
దగ నెగ్గులుచేసెనే విధాతృం డనినన్
నగుచును జిత్రగ్రీవుఁడు
తగునే యెఱిఁగియును నడుగఁ దత్త్వజ్ఞనిధీ. 10

ఉ. ఎచ్చట నేనిమిత్తమున
నేపని యెవ్వనివంక నెప్పుడో
నచ్చట నానిమిత్తమున
నాపని యాతనివంక నప్పుడో
నచ్చుగ మర్త్యకోటికి శు
భాశుభనిర్మితకర్మజాలముల్
దెచ్చి విధాత కాలముగ
తిం గడియించుఁ దలంక నేటికిన్. 11

వ. అనిన విని హిరణ్యకుండు. 12

గీ. నూటపదియోజనంబులపాటి నెగసి
యవనిఁ బక్షులు పొడఁగాంచు నామిషంబు
కాలసంప్రాప్త మైనచోఁ గానలేవు
పాశబంధంబు లేమి చెప్పంగవలయు. 13

క. గ్రహపీడ చంద్రసూర్యుల
కహిగజవిహగముల కగ్రమగు బంధనముల్
బహుమతికి దరిద్రత్వము
విహితంబుగఁ జేసినట్టి విధి నేమందున్. 14

వ. అని యిట్లు హిరణ్యకుఁడు పలికి తనమిత్త్రుం డగుచిత్రగ్రీ
వుఁ బంధనిర్ముక్తుం జేయం దలంచి కదిసినం జూచి చిత్ర
గ్రీవుం డిట్లనియె. 15

క. పరిజనబంధచ్ఛేదము
వెరవునఁ గావించి పిదప విడిపింపు ననున్
బరివారము నరయని నృప
వరునకు నెక్కడిది రాజ్యవైభవ మొందున్. 16

వ. అని యిట్లుపలికినఁ బ్రియం బంది హిరణ్యకుం డిట్లనియె.

క. నీనిర్మలగుణసంపద
నీనడవడి నీక యొప్పు నిన్నుఁ గొనియాడం
గా నాకు శక్యమగునే
భూనుతగుణ నిన్నుఁ బోల్పఁ బురుషుఁడు గలఁడే. 18

గీ. వాలి భూలోకమంతయు నేలఁజాలు
నధికపుణ్యుండ వని కొనియాడి యతని
పరిజనంబుల నిర్బంధభార ముడిపి
పిదపఁ దత్స్వామి విడిచి సంప్రీతితోడ. 19

గీ. విందువెట్టి యనుప వేడ్క నాతఁడు పోవ
నా హిరణ్యకుండు నరుగఁ జూచి
లలి నెఱింగి యపుడు లఘుపతనుం డను
వాయసంబు గదిసి వాని కనియె. 20

గీ. ఓహిరణ్యక సఖుని నిట్లూఱడించి
బంధనిర్ముక్తునిగఁ జేసి పంపఁ జూచి
సౌఖ్యకరమైన నీతోడి సఖ్యమునకుఁ
గాంక్షచేసితి నన్నట్లు గారవింపు. 21

వ. అనిన హిరణ్యకుం డతనితోడ నీకును నాకును మైత్రి యె
ట్లు గూఢనేర్చు వినుమని యిట్లనియె. 22

గీ. ఎవరి కెవ్వరి కేభంగి నెట్లు పొసఁగు
నట్టివారికి మైత్రి దా నమరుఁగాక
నా శరీరంబు నీకు నన్నంబు నీవు
భోక్త వటుగానఁ జెలిమికిఁ బొందుగాదు. 23

వ. అనిన విని లఘుపతనుం డిట్లనియె. 24

క. నీదేహము నాకశనము
గా దోపుణ్యాత్మ యెట్టికష్టుఁడనే యు

మ్మేదినిఁ జిత్రగ్రీవుని
నీదగుసఖ్యంబునొంది నెఱపుము నెమ్మిన్. 25

వ. అనిన హిరణ్యకుం డిట్లనియె. 26

గీ. చపలమతివి నీవు చాల నమ్మినవాని
నెలమిఁ బ్రోచుశక్తి యెట్లు గలుగుఁ
జంచలుండు చెఱుచు సకలకార్యంబులు
గాన నీకు నాకుఁ గాదు పొందు. 27

గీ. నీకు నాకును శాత్రవనియత ధర్మ
మైననడవడి వర్తిల్లు నాత్మయందుఁ
గల్మషములేని మైత్రి దాఁ గలుగు టెట్లు
గానఁ జెప్పంగ నదియు యుక్తంబు గాదు. 28

గీ. బుద్ధిమంతుఁ డైనపురుషుండు దనశత్రు
హితుఁడటంచుఁ జేరనిచ్చి చెడును
దప్తజలముచేతఁ దడిసినయగ్ని దా
హీనమగుచు శమిత మైనకరణి. 29

క. విను శక్యమైనకార్యము
చనుఁజేయ నశక్యమైనఁ జనునే చేయన్
వననిధిపై శకటంబును
నొనరంగా మిట్టనేల నోడయుఁ జనునే. 30

వ. అని యిట్లు హిరణ్యకుండు పలికిన లఘుపతనుం డిట్లనియె.

క. నీనీతి వాక్యపద్ధతు
లే నన్నియు వింటి నీకు నిష్టునిఁగా న
న్నే నెఱిఁ గైకొనకుండిన
నే నశనము దొఱఁగి దేహ మిచ్చుట వినుతున్. 32

గీ. మంటికడవంబోలె మఱి దుర్జనస్నేహ
మధికశీఘ్రముననె హత్తు విరియుఁ
కనకకలశభాతి గల సజ్జనస్నేహ
మొదవుఁ బగులఁబడక పదిల మగుచు. 33

వ. అని యిట్లు లఘుపతనురిడు పలికిన హిరణ్యకుం డిట్లనియె.

క. నే నీకు నెంతచెప్పినఁ
గానిమ్మన కెల్లభంగిఁ గావలె ననుచుం
బూనితి నాయెడ మైత్రికి
నేనుం దగ నియ్యకొంటి నెంతయు వేడ్కన్. 35

వ. అనుచు నివ్విధంబున నన్యోన్యసంభాషణంబుల నత్యంత స్నేహంబులు నిగుడ నఖమాంసంబులుంబోలి దుర్భేద్యంబులగు నంతఃకరణంబులం గలసి కూడి మెలంగునంత హిరణ్యకుండు తనగృహంబున స్వేచ్ఛావిహారం బొసంగి లఘుపతను వీడ్కొలిపిన నతండునుం దనమందిరంబునకుం జని యప్పటప్పటికి మహాగహనంబునకుం బోయి సింహశరభశార్దూలాదులచేతం జచ్చినమృగంబులమాంసంబులు

దెచ్చి హిరణ్యకునకుఁ బెట్టి తాను సుఖయో[illegible]
గొంతకాలంబునకు నొకనాఁడు హిరణ్యకుం [illegible]
పతనుం డిట్లనియె. 36

ఉ. ఉండితి నీకడన్ విమల
సోపక యిన్ని దినంబులోన నేఁ
డొండొకకాన కేఁగవల
యున్ ననుఁ బంపుము చక్రకోకకా
రండవరాజహంస బక
రాజవిహారవిరాజమాన మై
యుండు సరోవరం బచట
నుండును నా చెలికాఁడు నిచ్చలున్. 37

ఉ. ఆతఁడు మిత్రమందర స
మాఖ్యమునం బొగడొందు కచ్ఛపం
బీతఱి నేను బోవఁ బ్రియ
మేర్పడ వేగమె తెచ్చిపెట్టు నా
నాతనువర్ణమీనముల
నాదుశరీరము వృద్ధిఁ బొందు పే
రాతిశయంబు గానఁబడు
నట్లుగఁ బాయఁగరాని చుట్టమై. 38

వ. అనిన హిరణ్యకుండు నేను నిన్నుఁ బాసి నిలువ నేర్తునే న
న్నుఁ గూడఁ దోడ్కొనిపొమ్మనిన నతం డట్లకాక యని

చంచూపుటంబునం గబళించి గగనభాగంబున సముత్క్షి
కంబుఁ గొని చని వాయసంబు దాను మున్నరుగ నుద్దో్యి
గించిన సరోవరంబునఁ బెట్టి నిలిచినసమయంబున. 39

ఉ. ఎన్నఁడు రాని చుట్ట మిదె
యిచ్చటికిం జనుదెంచె భాగ్యసం
పన్నుఁడ నైతి నంచు జల
మధ్యము వెల్వడి యర్హసత్క్రియల్
గ్రన్నన నాచరించి చెలి
కానిఁ గనుంగొని కూర్మనాథుఁ డో
యన్న మహాత్మ మూషకము
నారసి యెచ్చటనుండి తెచ్చితో. 40

వ. అనిన మిత్రమందరునకు లఘుపతనుండు చిత్రగ్రీవోపాఖ్యా
నంబు మొదలుకొని హిరణ్యకుని గుణకథనంబు లమ్మహా
త్మునికిం దేటపడం జెప్పి నాకంటె నీవితని నీకు నిష్టసఖు
నింగాఁ బరిగ్రహింపు మని యతని నప్పగించిన నాశ్చర్య
చిత్తుండై మిత్రమందరుండు హిరణ్యకున కిట్లనియె. 41

క. పెక్కులు పలుకం బనిలే
దెక్కడికిం బోవవలువ దేనును నీవుఁ
జక్కఁగ కూడక యుందము
మిక్కడ నతిసౌఖ్యవృత్తి నింపెసలారన్. 42

వ. అనిన హిరణ్యకుం డిట్లనియె. 43

గీ. మిత్రమంథర నీదు చరిత్రమహిమ
మఖిలజనులకుఁ గొనియాడ నాస్పదంబు
గాన నాకును సంతోషకరము గాదె
నిన్నుఁ గనుఁగొన్న నాభాగ్య మెన్న నేల. 44

ఉ. మారుతముల్ వనంబులను
మానుగ షట్పదపంక్తి పుష్పలన్
హారివిహారిచారుకల
హంసము లంబులఁ బక్షు లంబదా
ధారముఁ గోరినట్లు ప్రమ
దంబుగ నేనును నిన్నుఁ జూడఁగాఁ
గారణ మాటఁ జేసి ఫల
కాంక్షలఁ జేరితి మివ్విధంబునన్. 45

వ. అని యిట్లు మిత్రమంథర లఘుపతన హిరణ్యకులు తమలో
పల సంభాషణంబులఁ బ్రొద్దుపుచ్చు సమయంబున. 46

క. సారంగ మొకటి మృగయుని
బారిం బొరిఁదప్పి బెదరి భయవిహ్వలతన్
గూరి పఱతెంచినంతటఁ
జేరువఁ బొడఁగాంచి వారు చిడిముడిపడుచున్. 47

వ. నితాంతభయభ్రాంతుండును గంపితశరీరుండును నగుచిత్రాం
గదుండను మృగసత్త్వము నాలోకించి వారలలో మిత్రమం

దగుం దమందానందకందళితహృదయారవిందుం డగుచు
నా హృగంబున కిట్లనియె. 48

ఉ. ఎచ్చటినుండి వచ్చి తిది
యేమి మృగోత్తమ నీమదిఁ భయం
బచ్చపడంగ నున్నయది
యవ్వల నెంతటికార్య మయ్యె నీ
వచ్చుట పెద్దలెల్ల నిట
వచ్చుట గావున నన్నపానముల్
పుచ్చుక మానివాసమునఁ
బొంది వనంబు నలంకరింపవే. 49

వ. అనివ విని చిత్రాంగుం డిట్లనియె. 50

గీ. వెంట విడువక లుబ్ధకవీరుఁ డొకఁడు
సారెకును వచ్చి నామీఁదఁ జలముకొన్న
నచట నుండక వచ్చితి నిచట మీకు
విందనై యున్న నామిత్రమందరుండు. 51

క. మాకంటె నీకుఁ జుట్టము
లీకాననమందుఁ గలుగ రిది నీయిలుగా
గైకొని నిలువుము నీవనఁ
జేకొని బహుకాల మధివసించినపిదపన్. 52

ఉ. అంగద నొక్కనాఁడు ప్రియ
మారఁగ మేఁతకు దూర మేఁగి చి

త్రాంగుఁడు రాక చిక్కుటయు
నర్మిలి నిద్దఱుం జింతనొంద న
య్యింగిత మాత్మలో నెఱిఁగి
యేపున వాయస మేఁగి కాంచె జ్ఞీ
ణాంగుని వాగురీనియమి
తాంఘ్రిని నాహారిణేంద్రు నొక్కచోన్. 53

క. కని లఘుపతనుఁడు డగ్గఱి
మునుకొని కన్నీరు దొరుఁగ మోహభ్రాంతిన్
దనమేను దుఃఖవహ్నిన్
గనలఁగ నిట్లనియెఁ బరమకారుణ్యమునన్. 54

ఉ. ఒక్కని వేఁడఁబోవు మఱి
యొక్కనిచేటున కియ్యకోవు వే
రొక్కనిసొమ్ము కాసపడ
నొల్లవు మాలవిధాత నిర్దయుం
డక్కట నీరునుం దృణము
నాని మహోగ్రవనాంతరంబునన్
గ్రుమ్మక్కెడు నీకు నిట్టియవ
మానము మానము దప్పఁజేసెనే. 55

క. ఈవంక కేల వచ్చితి
వేవెరవునఁ దగులువడితి విం కేఁట మనకున్

గానలయుక్తఁ బెయ్యది
నాఖువు నాతనికి హిరణ్యనాఖుం డనియెన్. 57

గీ. అనఘ వేఁటకాని కగపడ్డ నన్నుఁ గావ
నీకుఁ గడిఁది వాఁడు లేకయున్న
చని హిరణ్యకునకు సకలంబు నెఱిఁగించి
తోడుకొమ్ము పలుకు లుడిగి వేగ. 57

వ. అనినం గాకమ్మని లఘుపతనకుం డనువీథి కెగసి యతిత్వ
రితగతిం జని మిత్రమంథర హిరణ్యకులకుఁ జిత్రాంగుం
డుఱిఁబడుట తేటపడం జెప్పి హిరణ్యకుం దోడ్కొనిపోయి
నం జిత్రాంగునిం జూచి హిరణ్యకుం డిట్లనియె. 58

క. మతిమంతుఁడై ననీ వి
ట్లితరునిక్రియఁ దగులువడితి నీదుర్దశకుం
గతమేమి యనిన నాతం
డతనికి నిట్లనియెఁ జంచలాత్ముం డగుచున్. 59

క. మాటాడఁదగదు మౌన మి
చ్చోటను లుబ్ధకుఁడు వచ్చు ఘాతకము న్ని
పాటం దగిలినవారుల
స్ఫోటించుచుం గడఁగు ననింద్యచరిత్రా. 60

వ. అని యిట్లు చిత్రాంగుండు పలుకునంత నచ్చట మిత్ర
మంథరుం డాత్మగతంబున లఘుపతనహిరణ్యకు లరిగి తడ
వయ్యె నక్కారణంబు దెలియునంతకు నే నెట్లు గుండియప

ట్రియుండ నేర్తునని యప్పుడక్కడలి హిరణ్యకుండు చనినఁ జూడం
దపయ కయ్యెడకుం బోయిన హిరణ్యకుం డిట్లనియె. 61

గీ. మిత్రిమందర నీవు మామీఁదిభక్తి
నిచటి కేతెంచు టిది మాకు హితము గాదు
వేఁటకాఁ డిప్డు జేతెంచువేళ యయ్యె
వాని కగపడ కేము పోవంగఁగలము. 62

క. ఉదకంబులోన నైనన్
గొదగొని పాఱంగఁగలవు కుంభినిమీఁదన్
గదలంగ నేర వడిగెను
నదిగావున నీవు వచ్చు టనుచిత మెందున్. 63

వ. అనుటయు మిత్రిమందరుం డతని కిట్లనియె. 64

క. మతిమంతుఁడు గుణవంతుఁడు
హితుఁడును నైనట్టిసఖుని నెవ్వరుఁ బాయన్
ధృతి నిలువలేరు పాసియు
నతఁ డొకచోఁ గాలువొంద కలఁతం బొందన్. 65

చ. సురుచిరనిర్మలాత్ముఁ డగు
చుట్టమునందును శీలవృత్తి పెం
పరుదగు సాధ్వియందును బ్రి
యాస మెఱింగిన పుత్రునందునన్
బురుషుఁడు దుఃఖమంత యును
బోవఁగఁ దోఁచి యచింతతో నిరం

తరసుఖసంగతిఁ మెఱయుఁ

దా మనుచుండె ననంత కాలమున్. 66

వ. అని పలుకుచున్న యవసరంబున. 67

క. యమదూతవోలె నచటికి

సమదగతిన్ వేఁటకాఁడు చనుదేరంగాఁ

దెమలక హిరణ్యకుఁ డురిఁ

దుమురుగఁ దెగఁ గొఱికి బొక్కదూఱం బాఱెన్. 68

క. చిత్రాంగుఁ డటికి పఱచెన్

జిత్రిత లఘుపతనుఁ డెగసె శీఘ్రతఁ జంచ

ద్గాత్రిస్థూలతఁ గదలెడు

మాత్రంబున బోయ మిత్రమందరుఁ గనియెన్. 69

క. కని దానిఁ బట్టి త్రాటం

గొని యనువ్వునఁ గట్టి వింటికొప్పునఁ దగిలిం

చి నిజమనోరథభంగం

బున కాత్మం దలరి వాఁడు బుద్ధిం దలఁచెన్. 70

క. వలఁ జిక్కక చనె మృగ మ

వ్వలఁ జిక్కెను దాసరయ్య వలవని జాలిం

దలరంగ నేల నేఁడీ

కొలఁదియె కూరయ్యె ననుచుఁ గొనిపోవుతఱిన్. 71

క. మృగమును గాకము నెలుకయుఁ

దెగపడి కచ్ఛపము పోక తేటపడిన నె

వ్వగలం బొగిలెడు వానికి
మొగతప్పక కార్య మెఱిఁగి మూషిక మనియెన్. 72

క. వగ పధికరోగమూలము
వగపునఁ గార్యంబువచ్చువల నెఱుఁగం డి
మ్ముగ వగ పనర్థమూలము
వగపున శాత్రవభయంబు వచ్చుఁ జొచ్చున్. 73

క. కడలేని దుఃఖవార్ధిం
గడచితిఁ దొల్లియును నేఁడుఁ గడతముగా కి
ప్పుడు దైవ మేల మనలఁ
జెడఁజూచును దీని కేల చింతంబొందన్. 74

క. తగుమిత్రుఁడు భాగ్యాధికుఁ
డగువానికిఁగాని దొరకఁ డాపద యైనన్
దిగవిడువక రక్షించును
సుగుణాఢ్యం డుత్తముండు చుట్టంబైనన్. 75

గీ. తల్లియందును దనుగన్న తండ్రియందు
నాలియందును సుత సోదరాలియందు
నెంతసంతోషమగు నగు నంతకంటె
మేలిసౌఖ్యంబు నరునకు మిత్రునందు. 76

వ. అని యిట్లు తనప్రాణసఖుం డైన మిత్రమందరుండు దగు
లువడి పోవుటకుఁ బరితాపాంతఃకరణుం డగుచు హిరణ్యకుం
డు చిత్రాంగలఘుపతనుల నాలోకించి యిట్లనియె. 77

క. వడి నడవిఁ గడచి లుబ్ధకుఁ
డెడపవ్వగఁ జనియెనేని నెంతటివారున్
విడిపింపలేరు మనసఖుఁ
దడయక దీనికిఁ బ్రతిచింత దలఁపఁగవలదే. 78

వ. అనిహిరణ్యకుండు చిత్రాంగలఘుపతనుల కుపాయం బొం
డు బోధించుటయు. 79

చ. మెఱసి మహాజవంబునను
మేఘపథంబునఁ బొత్తె వాయసం
బెఱుఁగకయుండఁ బల్లమున
నీఱముదాటునఁ బోయె నమ్మృగం
బఱిముఱి నింతనంతఁ గడ
యం జనుఁదెంచెను మూషికంబు నే
ర్తెఱ మిగులంగ నయ్యెఱుకుఁ
దెంపుమెయిం గెలువం దలంచుచున్. 80

క. త్వరితముగ వేఁటకానికి
సరిగడచి మృగంబు వాయసంబును దూరం
బరుగుచును వాఁడు పోయెను
తెరువున నొకమడువుపతి నతిస్థిరబుద్ధిన్. 81

గీ. లోఁతులేని నీటితోన జిత్రాంగుండు
సాఁగఁబడుచుఁ గాళ్లఁ జాఁచికొనుచుఁ

గన్ను లమర మూసి కదలకుండఁ జచ్చిన
వాఁడుపోలె నుండె వాయసమును. 82

క. తల యెత్తి చంచుపుటమునఁ
బలుమాఱును బొడిచి తినెడిభావము దోఁపన్
దలకొనునంతట రెంటిన్
దళుకొత్తెడువేడ్క నెఱుకు దవ్వులఁ గాంచెన్. 83

గీ. కాంచి మేను వెంచి కడు నాత్మ హర్షించి
కమఠయుక్తమైన కార్ముకంబు
వెడఁగుబుద్ధితోడఁ గడుదవ్వునను బెట్టి
యుండెడు మృగముఁ జేరునవసరమున. 84

క. కనుగలిగి యింతనంతం
జనుదెంచి హిరణ్యకుండు సంతస మెసఁగన్
దనమిత్రు మిత్రమందకు
తనుబంధం బవుడు గొఱికెఁ దత్క్షణమాత్రిన్. 85

క. విడివడి జలమధ్యమునకుఁ
గడువేగమ కమఠమేఁగె గ్రక్కున బొక్కన్
బడె నెలుక వానిఁ బొడఁగని
విడెఁ గాకము నెగసె మృగముఁ బాఱెన్ దవ్వులన్. 86

గీ. ఆసగొలిపి పోయె నక్కట నన్ను నీ
చెనఁటిమృగ మటంచు సిగ్గువడుచుఁ

దిరిగి చూచె నపుడు తెగించుకపోయిన
కచ్ఛపంబు లేని కార్ముకంబు. 87

క. అందుకొని వెచ్చనూర్చుచు
మందిరమున కూర కెళ్లుమరలుదు ననుచున్
మందప్రయాణమునఁ దన
సుందరి యేమనునొ యనుచు స్రుక్కుచుఁ జనియెన్. 88

వ. ఇవ్విధంబున లుబ్ధకుండు విఫలమనోరథుండై కడుదూరంబుపోవుట నిరీక్షించి లఘుపతనుండు తోడిమువ్వురం గూర్చుకొని నిజనివాసంబునకుం జనుదెంచి పూర్వాకారంబున నన్యోన్య మిత్రభావంబునఁ జిరతర సౌఖ్యంబులం బ్రవర్తిల్లిరి. 89





# పంచతంత్రసంగ్రహము.

## సంధివిగ్రహము.

ఉ. మెండగుశాఖలన్ ధరయు
మిన్నును దిక్కులు నాక్రమించి మా
ర్తాండమరీచి జాలములఁ
దార్కొన నీయని యాకుజొంపముల్
నిండి మహాండజంబులకు
నిల్కడగా నొకకానలోన బ్ర
హ్మాండము ముట్టి యొక్కవట
మద్భుతమై పెనుపొందు నెంతయున్. 1

ఉ. ఆమహనీయ భూరుహము
నం దనిశంబు ననేకబాంధవ
స్తోమము దన్నుఁ గౌతుకము
తోఁ గొలువంగను మేఘవర్ణుఁడన్
నామముదాల్చి ప్రాభవము
నం బెనుపొంది వసించు వాయస

స్వామి విపక్షపక్షికుల
సంహరణ ప్రవణాంతరంగుఁడై. 2

వ. ఇట్లు వాయసనివాసంబైన నవ్వటమహీరుహంబున కనతిదూరంబున. 3

ఉ. వేఱొకవంకఁ గొండగుహ
వేశ్మముగాఁగ నులూకభర్త ద
న్మిత్రజనయుక్తి మంత్రులగ
మిం గలవాఁ డుపమర్ద నాముఁ డా
యాలయమునందు రేలు దమ
యిచ్ఛల మేసి దినంబు లాగుహన్
దూఱివసించుచుండి యొక
దుష్టత నాత్మకు నింపుపెంపఁగన్. 4

వ. ఒక్కనాఁటి నిశాసమయంబునఁ దనకుంగల మంత్రులం బిలిచి వారలతో నిట్లనియె. 5

క. మహిఁగాకులకును మనకును
సహజంబగు వైరమగుటఁ జంపఁగఁదగు నా
గ్రహమధిక మొప్పు నాకుం
బ్రహరింతు నిశాంధవృత్తిఁ బరఁగెడువానిన్. 6

క. మీరును మీమీసేనలఁ
దోరముగాఁ గూర్చుకొనుచుఁ దోడ్తెండనినన్

వారట్లు సేయ ఘూకము
లారాత్రిరి నడుచుచుండి యన్నియుఁ దమలోన్. 7

క. వెలఁగుచును దివాభీతం
బులు వడినిబ్బంగి నడవఁ బొడఁగని విభుఁడ
బ్బలములతో నీరీతిని
వలనుగఁగదనమున నుండవలయుం జూండీ. 8

సీ. అనుచు నయ్యుపమర్దుఁ డర్ధరాత్రపువేళఁ
గదలుచుఁ గలయులూకములఁ గూర్చి
కొని మంత్రులును దాను గొదగొని పఱతెంచి
యరికట్టుకొని మత్తిలిరుగువాఱఁ
గావలి పదిలంబుగా నసంఖ్యల నిల్పి
తాను గొన్నింటితో లోను జొచ్చి
యధికనిద్రాసక్తి నంది మే నెఱుఁగక
కాకంబు లున్నట్టి కందు వెఱఁగి

గీ. యఱికి కొన్నిటికంఠముల్ నఱికివైచి
యేచి కొన్నిటివక్షంబు లూదివైచి
కదిసి కొన్నిటి పార్శ్వముల్ చదిపివైచి
గ్రుచ్చి కొన్నిటికడుపులు వ్రచ్చివైచి. 9

వ. మఱియు ననేకప్రకారంబుల నయ్యులూకంబులు కాకం
బులకు మహాప్రళయం బాపాదించి యున్నత్యంతకోలాహ
లబహుళం బైనవటగర్భంబు నిశ్శబ్దంబై యున్నంగనుం

గొని పగర ననవశేషంబుగా సంహరించితిమని సంతసి
తమయంత వట్టునుం గూడుకొని యులూకంబులు నిజ
వాసంబునకుం జనియెఁ దదనంతరంబ. 1

గీ. అట్టియుత్పాతకాలంబునందు మేఘ
వర్ణుఁ డొకతొఱ్ఱఁ దనమేనువైచి యుండఁ
దెల్లవాఱంగ నాత్మీయు లెల్లఁ బడుట
కాత్మఁ దలపోసి చింతించు నవసరమున. 11

క. అతనికిఁ గులక్రమాగత
మతియుతులగు మంత్రివరులు మాన్యులు గల ర
ద్భుతచరితు లేవు రప్పటి
గతికిం బ్రాణములతోడఁ గడచినవారల్. 12

వ. వార లెవ్వరంటేని యుద్దీపియు సందీపియు నాదీపియుఁ
బ్రోద్దీపియుఁ జిరంజీవియు ననువా రామంత్రివరులు కదిసిన
నాలోకించి దీనాననుండగుచు మేఘవర్ణుం డిట్లనియె. 13

గీ. ఏను లేని మీర లెందును గొఱగారు
మీరు లేని నేను మృతునియట్ల
కాన నేను మీరుఁ గలిగితి మీవేళ
భాగ్యమహిమఁ బగరబారిఁ బడక. 14

క. మీబుద్ధిబలముప్రాపున
నా బాహుపరాక్రమమున నడచితిమి తుదిన్

గూఢబలచే నిల్పితిమి
దాఁ బ్రబలమై విగ్రహాదికార్యతంత్రము చెప్పుఁడీ. 15

వ. అనిన మేఘవర్ణునకు సందీపియనుమాత్యుం డిట్లనియె. 16

సీ. బలవద్విరోధికిఁ దొలఁగి యవ్వల నుండు
బలవంతుతోఁ గూడి నిలుచుటొండె
స్థల ముజ్జగించి యసాధ్యమార్గంబున
నుండుచో నవ్వల నుండుటొండె
గాక దూరంబుగా గడిభూములకుఁ బోయి
యుపకారి యచ్చట నుండుటొండెఁ
గార్యంబు లని నాకుఁ గానవచ్చినభంగిఁ
జెప్పితి నింక నీచిత్త మనిన
నతనిపలుకులు విన్నవాఁడై యతండు
వరుస సందీపి యనియెడువానిఁ జూచి
నీతలం పెట్టిదన్నను నెమ్మి నతఁడు
వినయశీలుఁడై మేఘవర్ణునకు ననియెఁ. 17

గీ. తొలుత నుద్దీపి దేవరతోడ విప్రుఁడు
సరవిఁ జెప్పిన మూఁడుపక్షములు సమరు
నందు విను పుత్తమంబగు నదియు మిగుల
వేగపడిపోవు కార్యంబు వెరవుగాదు. 18

క. తనయున్నచోట నుండఁగ
ననుకూలతఁ గార్యసిద్ధులగుఁ దగినక్రియన్

విను మేఁకపోదుగుచన్నుల
జనితంబగుపాలు గళములచన్నులఁ గలవే. 19

వ. అనుటయు. 20

క. విని యాదీపిం గనుఁగొని
యనుకూలం బైనకార్య మనుగొంటయును నా
మనమునఁ దోఁచినయర్థము
వినిపించెద ననుచు నాత్మవిభునకు ననియెన్. 21

చ. అతిబలవంతుఁ డైన విన
యంబున వారలతోడిమైత్రి సం
తతమును నిశ్చలం బగుచు
నంబునఁ జేసి నిజప్రదేశసం
గతుఁ డయి పొల్చుటొప్పు నది
గాదని యొండొకదేశ మేఁగినన్
ధృతిమెయిఁ బోరిన న్విను
ధీయుత నొచ్చునతండు నేరమిన్. 22

క. అటుగాన నధికబలతులఁ
దటుకున మన మిచటఁ గూర్చి తగుసంధియు సం
ఘటితముగఁ జేసికొని యీ
వటమార్గమునందు నిలువవలయుం జూడన్. 23

వ. అని చెప్పుటయును. 24

క. అమ్మాటలు వెడ యూఁకొని
క్రమ్మఱఁ బ్రోద్దీపివంకఁ గనుఁగొని తగ నీ
నెమ్మనమునఁ గలకార్యము
సమ్మతితోఁ జెప్పుమా నిజంబుగ ననిన౯. 25

వ. అతం డవ్వాయసపతి కిట్లనియె. 26

గీ. రాత్రిగాని కానరా దులూకములకుఁ
బగలుగాని కానఁబడదు మనకు
రాయబారి సంధిచేయుటకై పోవఁ
గాల మెద్ది పొందుగాదు దలఁప. 27

క. అదిగాన రాత్రిఁ గానక
కదలక నిద్రించు మనలఁ గ్రౌర్యం బెసఁగ౯
జడియంగ మోఁది పఱచిరి
వదలక యయ్యానువు దెలియవలదా మనము౯. 28

గీ. పగలు గాకున్న పగతుర నరికట్టి
తెగవధింప కేల పగ యడంగు
నాకుఁ జూడ ననియె నల్వురు నీభంగిఁ
బలుక నాలకించి పక్షివిభుఁడు. 29

వ. సకలనయశాస్త్రతత్త్వజ్ఞుండైన చిరంజీవి యనునమాత్యుం
గనుంగొని యతనికిం బ్రియపూర్వకంబుగా నిట్లనియె. 30

క. ఓతండ్రి నీమబుద్ధి
ద్యోతంబున రాజ్య మేను దుది ముట్టంగాఁ

ప్రీతిన్ జేసితి బంధు
వ్రాతముతోఁ గూడ నధికరాజప్రవృత్తిన్. 31

వ. కావున. 32

క. ఇప్పటికిఁ జేయఁదగినొకు
నప్పనికిం దెరువెట్లు నర్హుఁడ వనినన్
జెప్పఁదొడంగె నిజేశ్వరుఁ
గప్పినశోకతమ ముడుప ఖద్యోతనుఁడై. 32

వ. సంధివిగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులను షాడ్గుణ్యంబులు నెఱింగి కర్మప్రారంభ పురుష ద్రవ్యసంపత్తి దేశకాలవిభాగ వినిపాతప్రతీకార కార్యసిద్ధు లను పంచాంగమంత్రంబులం బ్రవీణుండై సామ భేద దాన దండంబులను చతురుపాయప్రయోగసమయంబులు నెఱింగి ప్రభుమంత్రోత్సాహశక్తిత్రయ సంపన్నుండై తత్తదుచితానుష్ఠానంబులం బ్రవర్తింపవలయుఁ గావున మనకులంబు గూడకుండుటం జేసి యుద్ధంబునకు సామర్థ్యంబు లేదు కాలంబునుం గాదు దనశక్తియుఁ బరశక్తియు దేశకాలంబులును విచారించి బకప్రకారం బదను గాచి యుండునది. పంచాస్యంబునుంబోలె నాసన్నం బైనకార్యంబు నప్పుడహితు నాశాంతి గొనునది యని చెప్పి మఱియుం జిరంజీవి యిట్లనియె. 34

కం. తనబలము నెదిరిబలమును
మనమునఁ జింతింప కరుల మర్దించుటకై
గొనకొనినవాని క్రొవ్వుమి
జనియించుట తప్పదండ్రి శకునికైనన్. 36

వ. మనకు నిప్పు డంగయ్యంబునకుఁ గాలంబుగా దెట్లనిన.

కం. బలసంపద లేకుండిన
వలయుధనము మంత్రివిధియు వసుధాపతికిన్
బలుపగర నోర్చుధనమున
విలసితమంత్రంబుచేత విశ్వము గెలుచున్. 37

గీ. ధరణి సత్సహాయవిరహితునకుఁ గార్య
మొక్కఁడైన జేయ నొప్పుగాదు
పక్షహీన మైనపక్షికి న్నాకాశ
గమన మసువుపడనికరణి నధిప. 38

ఉ. ఏలిక యాత్మబుద్ధిఁ దన
కింతుక దోఁపనికార్య మాప్తుఁడై
చాలవివేకి యైనఘను
సన్నిధి నూహ యొనర్పనేర్చినం
బోలఁగ నెల్లభంగులను
బొందగుచుండు విఘాతమారతః
వ్రాలిమిచేత నోడ జత
నంబుగఁ దీరముచేరుచందమై. 39

ఉ. కావున నేను శాత్రవని
కాయము గెల్చెద సాహసంబుతో
నావచనంబునమ్ముఁడు మ
నంబున నింతయుఁ జింతదక్కి నే
జీవముఁ బాసినట్టు గతి
చేష్పడి యుండెద రక్తపూరముల్
జేవురుచాయగా నొడలఁ
జిప్పిలజల్లుఁడు చచ్చి యత్తఱిన్. 40

గీ. మున్ను చచ్చిన కాకులమూఁకనడుమ
నన్నుఁబడవైచి తొలఁగి మిన్నకచనుండు
నేసమాశ్రయమొనరించి మోసపుచ్చి
వత్తుననుటయు నామేఘవర్ణుఁ డపుడు. 41

గీ. ఆచిరంజీవిఁ జెప్పినయట్ల చేసి
తానుఁ దనవారు నవ్వల తరువుఁబాసి
తొలఁగి తనమంత్రి పన్నిన యలఘుకార్య
మాత్మఁ దలపోయుచుండె నయ్యవసరమున. 42

వ. అంధకారంబునఁ జిరంజీవి తాను మున్నున్న వటమహీ
రుహంబుక్రింద మృతకాకమధ్యంబునంబడి రక్తంబునం
దొప్పదోఁగి రెక్కలువిచ్చి నేత్రంబులుమూసికొని మృ
తింబొందిన చందంబున డెందంబు కొందలం బడపుకొని

యున్న సమయంబున నక్కడ నుపమర్దనుండను తనమం
త్రులం గనుంగొని యిట్లనియె. 43

గీ. శత్రు నిశ్శేషముగఁ జేసి చంపకున్న
నొకఁడుదప్పిన మనకది యొప్పకుండు
గాన వేగంబ యామత్రికడకుఁబోయి
వెదకిచంపుటగార్య మీవేళ ననిన. 44

వ. అప్పలుకులాకర్ణించి యతనిమంత్రి లేక వాక్యంబుగా 45

ఉ. దేవర నీతివాక్యము ను
 ధీవిభవాఢ్యులు మెచ్చనాడితో
పోవుట మేలు నాఁ గదలి
 పోయి వటం బరికట్టి చుట్టునుం
గావలిపెట్టి చొచ్చి యొక
 కాకముఁగానక కాకులన్నియున్
జీవములం దొఱంగెనని
 చెప్పఁగఁ గ్రిమ్మఱి పోవ నత్తఱిన్. 46

వ. అవ్విధం బంతయు నెఱింగి చిరంజీవి తనలో నిట్లని విత
ర్కించె. 47

గీ. మొనసి చేయవలయు మొదల నుద్యోగంబు
చేసె నేని కార్యసిద్ధిఁ బొందఁ
జేయవలయుఁగానఁ జేసెదనని చిరం
జీవి నిశ్చయించి చింతదక్కె. 48

వ. ఉన్న సమయంబున. 49

క. కాకంబులెల్ల మడిసెం
గాకిచ్చట నొకటియైనఁ గలిగినె యనుచున్
గాకారులరుగు నంతట
నాకాకము కావుకావురని మొఱఁగింపన్. 50

వ. చిరంజీవికూఁతవిని యులూకంబులు పోకమగిడివచ్చి య
చ్చోటువెదకి చిరంజీవిఁ బట్టుకొనిపోయి తమయేలికగు నుప
మర్దనునెదుటం బెట్టినఁ గనుంగొని యతండు నీవెవ్వండవని
న నతండు నా పేరు చిరంజీవి యనుటయు నోరి నీవు మేఘ
వర్ణునకుఁ బ్రధానాగ్రగణ్యుండ విట్టివాఁడవైతివనినఁ జిరం
జీవి యతని కిట్లనియె. 51

సీ. అవధరింపుఁడు నన్ను నమ్మేఘవర్ణుండు
దప్పక కార్యంబు చెప్పుమనిన
నుపమర్దభూపాలుఁ డుగ్రుండు సాహసి
యధికబలపరితాపాన్వితుండు
సరగున మానమేగి శరణంబుచొచ్చిన
నతఁడు నీకెంతయు హితమొనర్చు
నని బుద్ధిచెప్పిన నతని చిత్తమెఱింగి
యనుచరవర్గంబు లాగ్రహించి

గీ. ఓరి పగవానిపక్షమై నోరికొలఁది
నొడివితివి దీనఁ జేటగుఁ గుడుపుమనుచుఁ

జరణఘాతంబులను మేనుచఱచి మట్టి
చంచుపుటములఁ గఱచి నొప్పించి చనిన. 52

క. డిగవిడువక ప్రాణంబులు
తగ నాకంఠమున నిలిచి తల్లడపడ చెక్
డెగనడవుఁడు మీఱైనను
సుగతికిఁ జనుసట్టిభంగి చొప్పడ నన్నన్. 53

వ. అనుటయు నుపమర్దుండు రక్తాక్షుండు మొదలయిన తన యమాత్యులం గనుంగొని వీని నేమి సేయుదమనిన నందు రక్తాక్షుం డిట్లనియె. 54

గీ. వీఁడె కాఁడు హీనవిమతుఁడైనను నొచ్చి
చిక్కినపుడ వేగఁ జెఱుపవలయు
గరుణఁ గాచెనేని కాలాంతరంబునఁ
బ్రతిఘటించి వాఁడె పగయొసంచు. 55

వ. అనుటయు క్రూరాక్షుండను వాఁడిట్లనియె. 56

క. శరణము చొచ్చినవానిన్
బరిమార్చినయతని కధికపాపం బనుచున్
బోరిఁజెప్పు ధర్మశాస్త్రము
పరమకృపం గావు వీనిఁ బక్షికులేంద్రా. 57

వ. అని చెప్పిన నుపమర్దుండను జిరంజీవిఁ జేరం దిగిచి యభయం బిచ్చి వెఱవ కుండుమని వీడ్కొల్పినఁ గొంతకాలం

బుండి దుర్గాంతర్మార్గంబు లెఱింగి యాచిరంజీవి యొక్క-
నాఁడు దనలో నిట్లని తలంచె. 58

క. అడుఁకు గల సత్వంబును
తెరువులు నునికియును వారు దిరిమ్మరుతావుల్
గిరిదుర్గము సాధించెదు
వెరవును నెఱిఁగితిని నాకు వేళగుఁ జెఱుపన్. 59

గీ. అని విచారించి గుహాపట్టు నరయఁ ద్రొల్లి
యాలమందల యునికిపట్టగుటఁ జేసి
కుప్పలై యున్న యెరువెల్లఁ గొక్కిరించి
చరణముల సన్నతెరువుల సరవిఁ బఱచి. 60

వ. తిరిగి పెద్దవాకిట వచ్చి యులూకంబులఁ జూచునప్పు డవి
రాత్రి దూరదేశంబులఁ బరిభ్రమించి మేసివచ్చి యలసి
సూర్యోదయసమయంబున మే నెఱుంగక యొండొంటిప
యిం బడి నిద్రింపఁ జూచి తలయూఁచి చిరంజీవి తనలో
నిట్లనియె. 61

ఉ. నమ్మినవారిఁ జంపినను
నాకు నధర్మము గాదు తెన్నుగా
నమ్మక చంపరాదు రిపు
నన్న నిజంబుగ నాత్మభృత్యుఁగా
నమ్మినదోష మెవ్విధము
నం దగఁ బొందె విచార నేఁటికిన్

సంధివిగ్రహము

నమ్మిన నానిజేశునకు
నాదుహితం బెఱింగింతు నెంతయున్.

క. ఏపని చేయుమంచుఁ దన
యేలిక సేవకుఁ బంచెఁ బొందుగా
నాపని దీర్చివచ్చుటయు
నాతనికిం దగుధర్మ మిట్టిచోఁ
బాపము పుణ్యమున్ విభుని
పాలగు భృత్యుని కేమికారణం
బేపున మేఘవర్ణునకు
నీసమయం బెఱింగింపఁ బొందగున్.

సీ. అని నిశ్చయింపుచు నతివేగమునఁ జని
యేలికఁ గాంచి కేలెత్తి మ్రొక్కి-
మనపగ సాధింప ననువైన కాలంబు
తెలిగాంచి వచ్చితిఁ ద్వరితముగను
వెనుక నత్తెఱఁగెల్ల విన్నవించెదఁ గాని
వీరు వారన కెల్లవారిచేతఁ
గాష్ఠతృణంబులు గలచి తే నియమింపు
మని తాను మందుచున్నట్టి కొలఁది
మొలసి నేర్పున ముక్కునఁ గఱచిపట్టి
కదలెఁ దృణకాష్ఠములు గొంచుఁ గాకకులము

ఘూంకారధ్వని వినుక నమిత్రతతిని
గెలుచు వేడుక నభవీథిఁ జెలఁగి పఱవ. 64

క. ఘూకాళింబులున్న గుహకును
వాకిటఁ గాష్ఠములఁ దృణము వడిఁ గప్పింపన్
పేకవిసి చిరంజీవియుఁ
జాకొనఁ దనముక్కుఁ గొఱవిఁ దగిలించివడిన్. 65

వ. తనదుపక్షానిలంబునం జేసి యయ్యనలంబు నిగుడం జేసిన.

శా. ధూమజ్వాలలతోడి వహ్ని గుహలో
దూఱంగ నయ్యండజ
స్తోమంబుల్ భయ సంభ్రమంబు లడరం
దూరంబుగాఁ బాఱఁ వ
త్సీమారంధ్రము లెందు లేకునికి నా
ర్తింబొంది యచ్చో నిజ
స్వామింజేరి యచేతనంబులగుచుం
జావంగ వీక్షింపుచున్. 67

వ. రక్తాక్షుం డుపమర్దన కిట్లనియె. 68

క. తెగిచంపరాదుగాక ముఁ
దగవని దుర్నీతు లపుడు దలకొల్పఁగ నీ
దగుమంత్రులు నీవును నీ
పగిదిం బడవలసె నిట్టిపాపముగంటే. 69

క. హితుఁడైన మంత్రి పలుకులు
మతి ననుమానించి వినని మానవపతి యీ
గతి దుర్దశలం బొందును
సుతసోదరబంధుమిత్రసుదతులతోడన్. 70

వ. అనినవిని యువమర్దుం డిట్లనియె. 71

గీ. వినమధర్మమైనపని ధర్మమనితోఁచుఁ
గాని తెరువు తెరువుగాఁ దలంచు
శత్రు మిత్రుగాను మిత్రు శత్రునిగాను
గాంచు నరుఁడు చేటుకాలమునను. 72

ఉ. కావున నాకుఁ బథ్యమగు
కార్యముగాఁ గనునొత్తి యమ్మెయిన్
నీవు హితంబుచెప్ప విన
నేరక దుర్ణయశీలినై చిరం
జీవిఁ బరిగ్రహించి జముఁ
జేర నుపాయముచేసికొంటినే
దైవికమైన చేతకును
దప్పు నుపాయము లొండుగల్గునే. 73

క. అని యూరకుండె నంతట
ననలశిఖాసమితిచేఁ [illegible]యు సమయం
గనుఁగొనుచు వాయసంబులు
పనివడి గుహఁజొచ్చి చూచి పరమప్రీతిన్. 74

క. అవి యుపమర్ద్దను సంగను
తిపి యారక్తాక్ష ముఖ్య హితమంత్రిసుహృ
న్నివహముల తనువు అనుచును
వివరించి యులూకసమితి, వెడలి కడంకన్. 75

గీ. అపుడు మేఘవర్ణాది వాయసకులంబు
పౌరిఁ జిరంజీవిఁ బొగడుచుఁ బోయి నిజని
వాసమున నంచితోన్నత వైభవమున
మేఘవర్ణుండు కొలువున మెఱయుచుండె. 76

వ. చిరంజీవి నాలోకించి నీ విన్నిదినంబులు శాత్రవజనంబులు
నమ్మనొల్లగా నెవ్విధంబునం గొలిచి తిరిగివచ్చిన నతం
డిట్లనియె. 77

గీ. సకలదిక్కుల రాజుల శౌర్యమహిమ
గెలిచి తనుఁగొల్చు తమ్ములు గలుగునట్టి
పాండవాగ్రజుఁ డనువు గాకుండునట్టి
వేళ హీనుఁడై కొలువఁడే విరటునగర. 78

సీ. దుర్మంత్రి నేలినతోడనే చెడు రాజు
చెడు నపథ్యంబులు చేసి రోగి
కలిమికి గర్వించి కలవాఁడు చెడు వేగ
లోలుఁడు చెడుఁ బరస్త్రీలవలన
బుద్ధి చాలకయుండు పురుషుచేఁ జెడుఁ గీర్తి
నడవడి గొఱగామిఁ జెడును మైత్రి

చెడు ననాచారిచేఁ జెందిన కులమెల్ల
నర్థలోభమున బుణ్యంబు చెడును
వింతభంగి దుర్వ్యసనికి విద్య చెడును
జెడు సుఖంబు పరాధీన సేవకునకు
నాజ్ఞ పాలింపఁ గొఱగాని యధిపుఁ డేలు
మండలం బెల్ల జెడు మాటమాత్రిలోన. 79

సీ. శుష్కకాష్ఠంబుల సోఁకున నగ్నియు
నతిమూర్ఖువలనఁ గ్రోధానలంబుఁ
జపలునివలన దోషంబును మగువల
వలనఁ గామోద్రేకవర్ధనంబు
దక్షునివలన నుదాత్తధనంబును
దయగలవారిచే ధర్మములును
మహితాత్మువలనను మహితధైర్యంబును
మనుజేంద్రువలన భూమండలంబు

నంతకంతకు నభివృద్ధి నందునట్లు
విశ్రుతోద్యోగ నిజధైర్య విక్రమముల
నతిసమర్థుఁడ వగుట నీ వరుల గెలిచి
యసమజయలక్ష్మిఁ గొంటి వాయసకులేంద్ర. 80

క. కడిఁదిపగరు గైకుప్ప గోశి
పోడిచినయ్యెడ నైన బ్రమకు బుద్ధివి జెఱుపం

బడిన యమిత్రుఁడు మఱి
న్నఁడు గా బ్రతుకంగలేక నాశము నొందెన్. 81

క. ఏపని యుద్యోగించిన
నాపని దైవానుకూల మైన ఫలించున్
రూపింపఁగ మానుష మని
చేపట్టి పెనంగనేని సిద్ధింప ది 82

వ. అని యిట్లు చిరంజీవి చెప్పిన హితోపదేశంబునకుఁ బగ సాధించిన సాహసంబునకుఁ బ్రియం బంది మేఘవర్ణుండతని కర్థరాజ్యం బిచ్చి తానును సామ్రాజ్యంబునం బూజ్యుం డై సుఖంబుండెన్. 83





# పంచతంత్రసంగ్రహము.



## లబ్ధనాశము.



సీ. రంగదుత్తుంగతరంగసంఘంబులు
        సరసాభినయకరాబ్జములు గాఁగ
బహువిధప్రచలనపాఠీనపంక్తులు
        ధవళవిలోలనేత్రములు గాఁగ
సురుచిరస్నిగ్ధపాండురఫేనపటలంబు
        చారుతరాట్టహాసంబు గాఁగ
లాలితభూరిబాలప్రవాళంబులు
        విరిసిన ఘనజటాభరము గాఁగ

ఘుమఘుమధ్వని వాద్యఘోషములు గాఁగఁ
జండతాండవాడంబరశంభుమూర్తిఁ
బోలు నని తన్ను జనములు పొగడునట్టి
వర్ణనకు నెక్కి యొప్పు మహార్ణవంబు.

ఉ. ఆలవణాంబురాశిదరి
        నర్జున తాల తమాల సాల హిం

తాల రసాల భూరుహావళి
తానము సొంపు వహింప నచ్చటన్
వేలతరంబులైన కపి
వీరులతో బలివర్ధనాముఁడై
శ్లాఘలఘువర్తనంబుల న
జనప్రియుఁ గ్రుమ్మరుచుండు నత్తఱిన్. 2

వ. మఱియును దత్సమీపంబున నొండొక యూథనాథుం
డైన కపీశ్వరుండు బలివర్ధను నుద్దేశించి. 3

ఉ. ఈముదిమర్కటంబునకు
నేఁటికి నీకపిరాజ్య మంచు ను
ద్దాముఁ ఘటుప్రతాపబల
దర్పమునన్ వెడలంగఁ దోలిన్
సీమకుఁ బాసి యొక్కరుఁడు
సిగ్గునఁగన్ బలివర్ధుఁ డేఁగె నా
రామవిహారముల్ విడిచి
రాజసవృత్తిఁ దొఱంగి యయ్యెడన్. 4

వ. చనిచని యొక్కనదీతీరంబున మధుగర్భంబను నౌదుంబ
రంబు ఫలభరితంబైనదాని నాలోకించి బలివర్ధనుండు దన
మనంబున. 5

క. కామితఫలముల నొసఁగం
గా ముందటఁ గల్పకంబు గానంబడిన

ట్లామేసి కను ఫలించెను
నాముందటిభాగ్యవాసనకు దృష్టముగాన్. 6

వ. అని తలంచి డాయంబోయి. 7

క. తరువెక్కి దీర్ఘశాఖలఁ
బరిపక్వఫలంబు లరసి భక్షించుతఱిన్
గరమునకుఁ దప్పి యొకఫల
మరుదుగఁ బడె నీటిలో మహాధ్వనితోడన్. 8

క. ఆచప్పుడు తనచెవులకు
నేచినకౌతుకముఁ బెనుప నెడనెడ ఫలముల్
వైచుచును సహజచాపల
మైచను మర్కటము చప్పుడాలించుతఱిన్. 9

వ. క్రికచనామధేయం బగు శింశుమారం బమ్మేడిక్రిందిజలంబులలోనఁ గ్రుమ్మరుచుండి మత్సమీపంబున నెన్నండును నిట్టియపూర్వధ్వని విన్నది లేదని తలయెత్తి చూచినన్నా యౌదుంబరతరుశాఖా సమారూఢశాఖామృగకరవిముక్త ఫలపతనం బమ్మహాగ్రాహంబు తెలిసి తానునమ్మధుర ఫలంబు లుపయోగించి యావృద్ధవానరంబుతోడఁ జెలిమి చేసి తన్మిత్రత్వానందంబున నమ్మధురఫలాస్వాదన లాభంబున నచ్చోటు గదలంజాలక కొన్నిదినంబులు మఱచి యున్న మొసలిం దలంచుకొని యమ్మొసలిభార్య దనసఖిం బిలిచి దానితో నిట్లనియె. 10

ఉ. ఇంతకుమున్ను నాదు
హృదయేశ్వరుఁ డెయ్యెడకైన నేఁగినన్
సంతసమొప్ప వచ్చు నిమి
షంబున నిన్నిదినంబు లయ్యెఁ దాఁ
జెంతలఁ జేరఁ డేమిటికిఁ
జిక్కెనొ కాక విలాసఖేలన
భ్రాంతి నిజాలయంబునకు
రా కపటం బ్రియ మంది నిల్చెనో. 11

క. తెలియంగవలయుఁ బొమ్మని
పలికిన నది పోయివచ్చి ప్రాణసఖికి నే
త్రలవడఁగఁ జెప్పఁదొడఁగెన్
గలవియు లేనివియుఁ గూర్చి కలఁకం బొందన్. 12

సీ. నెఱత నీవిభుఁ జూడ నీవు నన్నంపినఁ
జయ్యన నేను బరిచ్ఛన్నవృత్తిఁ
గదిసి చూచితి నొక్కకపిభామ రూపలా
వణ్యవిలాసభావములఁ బెద్ద
మధురగర్భమను నుదుంబరముపై నుండఁగఁ
బొడఁగని దానితోఁ బొందుచేసి
యూపొందు మక్కువ సంతకంతకుఁ బెంప
నీయింటితెరువును నిన్ను మఱచె

బేర్చుమతిఁ బూరుషులు నవతిప్రియులు గాన
వారి మాన్పంగ నేరికి వశము గాదు
చెలియ నీమీఁదిభక్తిమైఁ జెప్పవలసెఁ
గాక వివరింప నాకేమి కారణంబు. 13

క. అమ్మాట మొసతి లేమకు
నమ్మయి తాఁకుటయు నిశ్చయం బని మదిలోఁ
గ్రిమ్మను విరహానలమున
సమ్మోహనమూర్ఛ పరవశత్వముఁ జేయున్. 14

వ. అమ్మకరవధూటి ప్రియసఖీసంభాషణంబులఁ బెద్దయుం బ్రొద్దునకుఁ దెలివి నొంది.

గీ. మగఁడు చేసినట్టి నెగులునఁ గడునొచ్చి
విరహవహ్నిచేత వేఁగి వేఁగి
పొరలుచుండునంతఁ బొలఁతిపై మక్కువఁ
గొన్నిపొడిపండ్లు గొనుచు వచ్చె. 16

వ. ఆకరికచుం డట్లున్న తనప్రాణవల్లభం జూచి యిట్లనియె.

ఉ. పంకజనేత్రి నీమొదలి
భారము చూచి భయంబు పుట్టెడున్
గింకకుఁ గారణంబు పరి
కించి యొకించుక నాకుఁ జెప్పఁగా
గొంకక తీర్తునన్న విని
కోమలి నెచ్చెలిమోము చూచినన్

శంక యొకింతలే కది ని
జంబుగఁ బుట్టెడునట్టిభంగిగాన్. 18

వ. అశ్శింశుమారంబున కిట్లనియె. 19

ఉ. అక్కట నీవు పోయినది
యాదిగ నీకలకంఠి రుగ్ణతం
జిక్కినఁ జావకుండఁగఁ బ్రి
సిద్ధుఁడు సిద్ధుఁడు వచ్చి యౌషధం
బొక్కటి చెప్పి పోయె నది
యుక్తము నీ కెఱిగించువారమై
యిక్కమలాయతాక్షియును
నేనును నీపొడఁ గాన మెన్నఁడున్. 20

వ. అనిన నమ్మహాగ్రహంబు. 21

క. సంజీవని మొదలుగ నే
నంజక కొనివత్తు నెట్టియౌషధ మైనన్
దంజకపుమాట గాదిది
కంజాతదళాయతాక్షి గ్రక్కునఁ జెపుమా. 22

వ. అనిన నది యిట్లనియె. 23

క. వానరహృదయముతోఁ దగ
మానినయౌషధము వెట్ట నువిదకు మానున్
మేనఁగల రోగ మనుచును
దా నెంతయుఁ గరుణఁ జెప్పి తాపసుఁ డరిగెన్. 24

గీ. కానఁ గోఁతిగుండెకాయ నీ విప్పుడు
తెచ్చి యిచ్చితేని తెఱవ బ్రతుకు
తేకయుండితేని నీకులభామిని
తనువు విడుచు గడియతడవులోన. 25

వ. అనినఁ దద్వచనంబు లాకర్ణించి యతం డట్టిదకాక యను చుఁ గొంతద వ్వరిగి యరిగి తనమనంబున నిట్లని వితర్కించె. 26

క. తరుచరహృదయము నాకుం
దరమే దొరకింపఁ గష్టదశ వచ్చెఁ గపీ
శ్వరుఁడు బలివర్ధుఁ డొక్కఁడు
పురుషార్థపరుండు వానిఁ బొరిఁగొనఁ దగునే. 27

చ. అతని వధించు టెంతయు మ
హాదురితంబు సమస్తధర్మసం
తతికి నిధాన మీసతి వృ
థా మృతిఁ బొందినఁ బాప మీయెడఁగా
మతిఁ దలపోయ నిద్దఱును
మాన్యులె యైనను భార్యరక్ష దా
సతిశయధర్మ మంచుఁ దగ
నార్యులు చెప్పఁగ విందు నెల్లెడన్. 28

వ. కావునఁ గులకాంతను రక్షించుటయ యుత్తమధర్మంబు మిత్రుండైన బలివర్ధనుఁ బరిత్యజింతు నని కృతనిశ్చయుం

ండై యాశింశుమారప్రవరుం డనుమానించుచు మందగ
మనంబున నమ్మర్కటుం బరంబు చేరం జనుదెంచినం జూచి
మిత్త్రుండైన బలివర్ధనుం డతని కిట్లనియె. 29

గీ. ఎంతవేగిర మింటికి నేఁగి తివ్వ
డింతలోననె మరలితా నెద్ది కతము
మంతగమనంబుతోఁ జింత నొందె దేమి
కారణం బన్న నమ్మహాగ్రాహ మనియె. 30

క. చిరకాలమైత్త్రి నీయెడ
జరగంగా నింటి కరుగఁజాలక నేఁ డ
ట్లరిగిన నచ్చటినాయి
ల్లెరవై మదిఁ దోఁచె నిలువ నెట్లగుఁ జెపుమా. 3

క. ఉపకారవాంఛ సఖ్యము
నిపుణాతఁ జేయుదురుగాక నీ వేమియుఁ బ్ర
త్త్యుపకార మపేక్షింపని
సుపురుషుఁడవు గావె యెపుడు సుస్థిరచరితా. 3

వ. అనుటయు బలివర్ధనుం డిట్లనియె. 3

గీ. దాని యుపకార మేనేమి చేసినాఁడఁ
బూని నీతోడఁ జేసిన పొందువలన
రాజ్యవిరహితదుఃఖభారంబుఁ ద్రోచి
తాల్మి నున్నాఁడ నదియు యుక్తంబు గాదె. 3

గీ. శోకశాత్రవభయములచొప్పు మాన్పు
ప్రీతివిశ్వాసగుణహేతుభూతమైన
మిత్ర మనునక్షరద్వయమిశ్రమైన
రత్న మేవేల్పు సృజియించెఁ బ్రబలె నొక్కొ. 35

వ. అని పలికిన విని కరికచుం డిట్లనియె. 36

ఉ. మింటికి నిక్కు నీతరువు
మీఁదను నీవును నేను నీటిలో
నొంటిఁ జరింప నోపుదును
నోర్తునె వీపున మోచి నిన్ను మా
యింటికిఁ గొంచుఁ బోయెదఁ
గపీశ్వర తమ్ముని నాకుణంబ ని
ష్కంటకబుద్ధిఁ బెట్టుటకి
గ్రక్కున వీపున వచ్చి నిల్చినన్. 37

క. నిలిచినకపివరుఁ దోడ్కొని
నిలుపోవక మొసలి తలఁచె నేఁ డీమిత్రుం
జలము గొని చంపవలసెను
కలఁడే నావంటిపాపకర్ముఁడు జగతిన్. 38

. స్త్రీకార్యము బలవంతము
నాకింతటి సాధుమిత్రు నగచరు మృతుఁగాఁ
జేకుఱఁగఁ జేయుకతమున
లోకంబున నింద కేను లోనైతిఁ గదా. 39

వ. అనితలపోసి విచారంబు పెల్లుబనఁ బరాకుపడి యున్నస్పష్టంబుగా.

గీ. ఆఁడుదానికొఱకు నకట నాప్రియమిత్రు
వృద్ధుఁ జంప నెట్లు బుద్ధిపుట్టె
ననుచు వినఁగ నాడు నమ్మాట లాలించి
వానరుండు పలికె వానితోడ. 41

క. ఏమంటి విప్రుడు నీలో
నేమిటి కీచింత నాకు నెఱిఁగింపు మనం
గా మొసలియు నిట్లను నే
నేమియు ననఁ దప్ప వింటి వే నేమంటిన్. 42

క. అనుమాట కాత్మలోపల
ననుమానము నొంది వానరాధిపుఁ డీతం
డనుమానించుచు వగచుచు
ననుఁ గొనిపోవుటకుఁ గారణం బెయ్యదియో. 43

గీ. అడిగి చూచెదఁ గాకంచు నగచరుండు
కలఁక నొందిన మదితోడ జలచరేంద్రు
నాకుఁ దోఁబుట్టువైన నీనాతి కిపుడు
సేమమే యన్న నామాట చెవులుసోఁక. 44

ఉ. అల్లన శింశుమారవిభుఁ
డాకపినాథునిఁ బల్కె మన్మనో
వల్లభ రోగపడ్డయది
వైద్యు లసాధ్య మనంగ దాని కే

నల్లమునం దలంకెదఁ బ్రి
యోగము చెప్పినఁ దీర్పువారు లే
రెల్లెడ నీటిలోనివని
యింతియ నాపని మిత్రవత్సలా. 45

వ. అనుటయు నాబలివర్ధనుం డిట్లనియె. 46

క. పొమ్మనవు పోయి మందులు
తెమ్మనవు చికిత్స చాలఁ దెలిసిన వైద్యున్
రమ్మనవు భార్య నిజమగు
సొమ్మనవు దలంక వేమిచోద్యము చెపుమా. 47

వ. అనిన నమ్మకరకులాధీశ్వరుం డిట్లనియె. 48

ఉ. అడిగినవాఁడఁ బండితుని
నాయన చెప్పఁగ మందు నీకడం
దడవఁగఁ జాల కేను బరి
తాపముఁ బొందుచు నున్నవాఁడ ని
ప్పుడు నెఱుఁగింపకున్న యది
పోవదు నామదిలోన దుఃఖమున్
గడవఁగ నీవ కారణ మ
కారణబాంధవ యెన్నిభంగులన్ 49

వ. అనినఁ దరుచరనాథుం డిట్లనియె. 50

గీ. మనసు గలసినచో నొకమాటయైనఁ
గపటమునఁ జెప్పకుండుట కలుష మండ్రు

పాణిసఖుఁడగు నాకు డాపంగనగునె
చెప్పఁదగనిది తైనను జెప్పు మనిన. 51

వ. అమ్మాటకుఁ బుయిలోట దక్కి మొసలి యిట్లనియె. 52

క. వానరహృదయముతోఁ దగ
నూనినరకౌషధముఁ దెచ్చి యువిదకుఁ బెట్టన్
మేనఁ గల రోగమంతయు
మానుననుచు నొక్కవెజ్జ మగువకుఁ జెప్పెన్. 53

ఉ. చెప్పిన నన్నుఁ దేమ్మనియెఁ
జెప్పెడి దేమి పతెందు నేరికిం
జెప్పక నీకునుం దెలియఁ
జెప్పఁగఁజాలక యాత్మ నాకు నేఁ
జెప్పఁగ నీవు నన్నడుగఁ
జెప్పితిఁగాని భయంబు పుట్టఁగాఁ
జెప్పుటగాదు కార్యగతి
చెప్పితి వానరయూథనాయకా. 54

క. తనసతికి రోగమైనం
గనుఁగొని యది చక్కఁబెట్టఁగా నేరఁ డితం
డని నన్ను బంధుజనములు
మనుపీనుఁగుఁగాఁ దలంప మను టేమిటికిన్. 55

వ. అని చెప్పినఁ గపీశ్వరుండు. 56

గీ. సగముచచ్చినమేనితోఁ జకితుఁ డగుచుఁ
గంప మొందుచు వృద్ధమర్కటము మూర్ఛ
మునిఁగి కన్నులు గానక మణఁగి కొంత
వడికిఁ దెప్పిఱి యాత్మ దైవంబు దూఱి. 57

వ. తనలో నిట్లని వితర్కించె. 58

గీ. ప్రేమ నటియించి యింటికిఁ బిలువఁ దడవ
మొసలిమాటకు నాకేల మోస గలిగె
నెంతముదిసిన నేను జితేంద్రియుండఁ
గామి నాపదఁ బడితి యుక్తంబు గాదె. 59

వ. అని తలంచి బలివర్థనుండు దైవానుకూల్యంబున నాయు
శ్శేషంబు కతంబునం దనకు నప్పటికొక్క యుపాయంబు
తోఁచిన నాశింశుమారంబునకు నిట్లనియె. 60

క. ఓయన్న కల్లచేసితి
వీయర్థము మున్ను నాకు నెఱిఁగించిన నే
నాయంతరమునఁ గలిగిన
యాయాషధ మపుడ కొంచు నరుదెంతుఁ గదే. 61

ఉ. గుండియ పుచ్చి పెట్టుకొని
కొమ్మపయిం బదిలంబుచేసి నే
నుండుదు నట్టిభారమున
కోర్వక యెవ్వను నేను నే సభా

గ్వాండజుడు నీకు నక్కటికో
గూర్చినహా మ్మృని యుస్మత్కింగ జే
కుంటుటఁజేసి యేమని కి
యోక్తులు పల్కుదు నేమి సేయుదున్. 62

వ. అయినను త్వరితగమనంబున నయ్యుదుంబరంబు కడకుం జని యస్మదీయహృదయంబు గొని చనుదెంత మని పలికి వెండియు. 63

గీ. మొసపి ధర్మార్థకామముల్ మూటివలన
ఫలము లెవ్వాఁడు దా నాసపడియె నేని
వాఁడు రిక్తహస్తములఁ బోవంగఁ దగదు
భూమిసుర రాజ కాంతలపొంత కెందు. 64

క. మానుగ హృదయం బచ్చటి
మ్రానం దగిలించియుంటి మన మట మసుడం
గా నరిగి వేగ వది గొని
మానిని యున్నెడకు నిపుడె మరలఁగవలయున్. 65

వ. అనిన. 66

క. అమ్మాటల జలచరమును
సమ్మతితో నమ్మి వృక్షచరమును గొనుచుం
గ్రిమ్మఱి మున్నున్నతరువు
కొమ్మం గదియింప, గపియుఁ గుప్పించి వడిన్. 67

గీ. అంతకంతకుఁ బొడవుగా నరిగియరిగి
వృక్షశాఖాగ్రమున నున్న వృక్షచరముఁ
గాంచి చెలికాఁడ రమ్మ వేగంబ మనకుఁ
బోవవలె నన్న జలచరంబునకు ననియె. 68

గీ. పొందు చేసి చేసి పొసఁగక మతిపోయి
తిరిగి వచ్చునతఁడు తిరుగఁ జెడును
ఎఱిఁగి యెంతవెఱ్ఱియేనిఁ జావు దనంత
కోరి తెచ్చుకొనునె కూర్మి నమ్మి. 69

వ. ఏ నిప్పుడు మృత్యుముఖంబు వెలువడితి నింక మోసపో
వుట గలుగదు. విచ్చేయు మనిన శింశుమారవల్లభుండు
లబ్ధనాశంబునకుఁ జింతాక్రాంతుం డగుచు జలమధ్యంబు
నకుం బోయె. 70





# పంచతంత్రసంగ్రహము.

## అసంప్రేక్ష్యకారిత్వము.

సీ. గౌడదేశంబునఁ గల దగ్రహారంబు
సకలసౌఖ్యములకు జన్మభూమి
తన్నివాసంబుగ ధరణీసురాన్వయ
జాతుఁ డుండును దేవశర్మ యనఁగ
నాయనకులకాంత యాజ్ఞసేని యనంగ
శుభలక్షణాంగి యాసుదతి తనకు
ఘనపురాకృతపుణ్యకర్మంబునను జేసి
సమధికంబైన గర్భము ధరింప
నధికసంతోషచిత్తుఁడై యతివఁ జూచి
నాతి నీగర్భమున నున్న నందనుండు
మనకులం బెల్ల నుద్ధరింపంగ నోపు
భాగ్యవంతుఁ డౌనన దనభర్తఁ జూచి. 1

వ. యాజ్ఞసేని యిట్లనియె నాథా నీమనోరథసహస్రంబు లేమి యుఁ గొఱగా వీయస్థిరంపు సంసారంబునకుఁ గడకట్టిన కార్యంబు తుదముట్టనేరదని పెద్దలచే వినంబడు వినుమని యిట్లనియె. 2

గీ. మహి ననాగతకార్యంబు మదిఁదలంచి
కోరునాతఁడు దుఃఖసంకులత నొందుఁ
బెక్కువిధములఁ జింతింప బెండువడుట
సహజ మది గానఁ బేరాసఁ జనఁగరాదు. 3

వ. కావున నీవును ననాగతమతిం దలంపం దగదన్న గొన్నిది
వసంబులకుం బరిపూర్ణంబయిన గర్భంబున నాతన్వికి శుభ
లక్షణాలంకృతుండైన నందనుండు పుట్టిన సాంద్రానందం
బునం బొదలుచున్న సమయంబున. 4

గీ. పుణ్యదివసంబు వచ్చినఁ బొలఁతి వేడ్క
నర్భకుని నాత్మనాథున కప్పగించి
విప్రకన్యాసమేతయై వెడలి నదికిఁ
బావనస్నాన మొనరింపఁ బోవునంత. 5

ఉ. ఆనగరంబుభూపతిగృ
హంబునఁ బుణ్యదినంబు వచ్చినన్
దానముఁ గైకొనం దలఁచి
తక్కినవిప్రులు పాఱుచుండఁగాఁ
దా నది చూచి బ్రాహ్మణుఁడు
తద్దయు శోకము నొంది యాత్మలో
మానిని నేల పంపితిఁ గు
మారునిరక్షకు నెవ్వ రిత్తఱిన్. 6

వ. అని మఱియు నమ్మహీసురవరుండు తనమనంబున. 7

ఉ. ఎక్కడి తెల్లఁ దీఱువన్న
 ప్రాగణికిం బోడసూపకున్న నా
తిక్కడ వెన్నపాపనికి
 నెవ్వరు కాఁపిఁక వేళదప్పెఁ బో
లక్కడ నేఁ ప్రయోజనము
 లబ్బి మనంబున మానవుంతు దా
నొక్కటి చింతసేయ విధి
 యొక్కఁడు వేఱ తలంచు నక్కటా. 8

గీ. అనుచుఁ గదలి పోవు నటపోయి క్రిమ్మఱ
తిగిడి వచ్చి బాలు మొగము చూచు
సుదతి వచ్చుతెరువు చూచు దిక్కులు చూచు
నిక్కి చూచు గోడ లెక్కి చూచు. 9

వ. ఇవ్విధంబున నాందోళించు డెందంబు కొందలం బంద
నందందు సందడిం బొందుచుఁ బొందువడి డిందుపఱచు
కొని పుత్రసమానంబుగా మునుమున్న పెంచిన నకులంబు
నాలోకించి దాని బంధించిన సూత్రంబు విడిచి కొనివచ్చి
కుమారునిచుట్టునుం ద్రిప్పి సంజ్ఞగా నెఱింగించి తలవాకి
టం బదిలంబుగా నిలిపి పుత్రసంరక్షణంబు నీకుం గర్తవ్యం
బని పలికి బ్రాహ్మణుండు చనినం దదనంతరంబ. 10

సీ. నకులంబు చూడంగ నొక కృష్ణసర్పంబు
 వడిగొని మూషకద్వారవీథి

గాఁ జొచ్చి బాలునిఁ గవియునంతట ముంగి
యుదరి నాగము ముట్టి యొడిసిపట్టి
కంఠంబు గ్రక్కున ఖండించి మేనెల్ల
శతఖండములు చేసి చంపివైచి.
నవరక్తధార లాననమున జొత్తిల్లి
శోభిల్లుచున్న నచ్చోన నిలువ,
దాన నుంది యప్పుడు ధరణీసురుఁడు తన
పట్టిఁ దలఁచుకొనుచుఁ బాఱుతెంచి
శిరము నోరు రక్తపరిషిక్తముగఁ దన
ముంగిటఁ దనుఁ గన్న ముంగిఁ జూచి. 11

క. ఈ నోరు రక్తమా రక్త
కానేరదు శిశువుఁ జంపెఁగా దుర్జాతం
బైన పురుషంచు నుగ్రత
దాసిం జావంగ నడిచెఁ దత్క్షణమాత్రికా. 12

వ. అడిచి యమ్మహీదేవుం డభ్యంతరమందిరంబునకుం జని
శతఖండీకృత కృష్ణసర్పంబును జెలంగి యాడుచున్న తన
కుమారుం గనుంగొని నకులమరణంబునకుఁ బరితప్తాంతః
కరణుం డగుచు నుదరతాడనంబు చేసికొనియు శిరంబు
వగుల మోఁదుకొనియు ధరణింబడి పొరలుచు మొఱలువె
ట్టుచు ననేకకాలంబునం బట్టి పట్టినటెఁ బెంచిన నకులంబుం
బరామర్శింపక వధించినపాపం బేమిటం బాయు నని మఱి

యు ననేకప్రకారంబులఁ బ్రలాపించుసమయంబున భార్య
చనుదెంచి యిది యేమినిమిత్తం బని యడిగిన నతండు త
ద్వృత్తాంతం బంతయుం జెప్పిన నమ్మగువ యతనికిట్లనియె.

చ. తనమతి వేగిరించి నెఱి
దప్పఁగఁ గజ్జము సేయరాదు చే
సిన యవివేకి నాపదలు
చెందుట సిద్ధము నీతికోవిదుం
డనయము సద్విచారమతి
యై యొనరించినయట్టికృత్యముల్
పనుపడి భవ్యసంపదలఁ
బాయ కొనర్చు ధరామరేశ్వరా. 14

వ. అని యిట్లు తనభార్య చెప్పిన వివేకవచనంబులకుఁ బ్రమో
దంబును నవిచారమూర్ఖత్వంబునం దానుజేసిన నకులవ్యా
పారంబునకుఁ బరితాపంబును నైనచిత్తంబుతో సర్వమ్మును
దైవాధీనంబుగా యని పలికి యమ్మహీదేవుండు దననం
దను నుపలాలనంబు చేయుచుఁ దనభార్యయుం దానును
జిరతరజీవనస్థితిం బ్రవర్తిల్లె. 15

---